# నా మాట

దాదాపు మూడుసంవత్సరాలనాడు ప్రారంభించాను, యీ పుస్తకాన్ని. ఒకరోజున మాటల సందర్భంలో కామ్రేడ్ గోపాలకృష్ణమూర్తి "రష్యావిప్లవాన్ని వ్యాసాల రూపకంగా ఎందుకు వ్రాయకూడదు ?" అన్నాడు. ఆ తరువాతనే "రాడికల్" పత్రికలో రష్యా విప్లవాన్ని గురించి అప్పుడప్పుడు ఏడు వ్యాసాలు వ్రాశాను. తరువాత నేను వ్రాయటం ఆగిపోయింది—"రాడికల్" పత్రికగూడా తాత్కాలికంగా ఆగిపోయింది.

కాని చాలామంది మిత్రులు "మీ రష్యావిప్లవాన్ని గ్రంథరూపంగా వేస్తున్నారా?" అని, "మీ వ్యాసాలు చాలా బాగున్నాయి, వ్రాయటం ఎందుకు మానివేశారు ?" అని, ప్రశ్నించడం మొదలుపెట్టారు. అచ్చులో వచ్చివుంటుందేమోనని చాలామంది ఆర్డర్లుగూడా పంపించారు. ఇక నేను పుస్తకం పూర్తిచెయ్యక తప్పేటట్లు కనుపించక ఒకటి రెండు రోజులు తీరికచేసుకొని చివరిభాగం పూర్తిచేశాను. ఒకసారిగా వ్రాసిందికాదు గనక పుస్తకంలో ఎక్కడన్నా పునరుక్తి దోషాలు వుంటే వుండవచ్చేమో. అయినా లేవనే నా నమ్మకం.

రష్యావిప్లవ స్వభావాన్ని గురించి అనేక దృక్పథాలున్నాయి. అందులో మార్క్సిస్టు దృక్పథంగూడా ఒకటి. ఈ మార్క్సిస్టు దృక్పథమే సరియైన దృక్పథమని వాదించేశాఖకు చెందినవాణ్ణి

నేను. ఈశాఖ అంతర్జాతీయంగావుంది. ఈశాఖను, యీ ఆలోచనా క్రమానికి, పునాదులువేసిన వారిలో యం. యన్. రాయ్ ముఖ్యుడు. అందువల్లనే యీ గ్రంథంవ్రాయటానికి కామ్రేడ్ యం. యన్. రాయ్ ఎంతో తోడ్పడ్డాడు. అందుకు ఆయనకు నాకృతజ్ఞత.

అడిగిన వెంటనే అపూర్వంగానూ, విజ్ఞానవంతంగానూ వుండే పరిచయ వాక్యాలు వ్రాసిపెట్టిన కామ్రేడ్ గోపీచంద్‌కు నా ధన్యవాదాలు. అసలు నేనీ పుస్తకం వ్రాయాలనే తలంపు కలిగించిన కామ్రేడ్ గోపాలకృష్ణమూర్తికి, దీనికి వెలుగు చూపించిన కామ్రేడ్ రవీంద్రనాథ్‌కు కూడా నా కృతజ్ఞత.

ప్రస్తుత పరిస్థితులను గురించి కాకుండా జరిగిపోయిన ఒక విప్లవస్వభావాన్ని గురించి సిద్ధాంత రీత్యా, శాస్త్ర రీత్యా, చర్చించే గ్రంథంగనకా, భారతరాజకీయాలతో ఎలాంటి సంబం లేని గ్రంథం గనకా, దీన్నయినా ప్రజలు, సంపాదకులుగూడా సహృదయంతో ఒందుకుంటారని నా నమ్మకం.

మార్క్సిజం తెలిసినవారూ, మార్క్సిస్టు దృక్పథంతో పనిచేస్తున్నవారూ, యీ గ్రంథాన్ని ఒప్పుకు తీరాలనిగూడా నా నమ్మకం.

పి. వి. సుబ్బారావు

# పరిచయం

పాతిక సంవత్సరాలకింద జరిగిన రష్యా విప్లవాన్ని గురించి ఇప్పుడు పుస్తకం ఎందుకూ? అని మీలో చాలామంది ప్రశ్నించవొచ్చు. ఇప్పుడున్న పుస్తకాలు చాలవా? అనే అనుమానం కూడా రావొచ్చు.

మీలో చాలామంది Ten Days That Shook The World అనే పుస్తకం చదివే వుంటారనుకుంటాను. రష్యా విప్లవం ప్రపంచాన్ని వూపింది ఆ గ్రంథకర్త అన్నట్లు ఒక్క పదిరోజులే కాదు. ఆ దెబ్బకు ప్రపంచం ఇంకా వూగిసలాడుతూనేవుంది. రష్యావిప్లవ ప్రభావం ఇంకా ప్రపంచాన్ని ఇన్‌ఫ్లుయన్స్ చేస్తూనే వుంది. 1789లో జరిగిన ఫ్రెంచ్ విప్లవం వివిధ దేశాల్లోని విప్లవాలకు దారిని చూపింది. ఈ రోజుల్లో రష్యావిప్లవం విప్లవ చరిత్రలో మరొక అధ్యాయాన్ని మొదలు పెట్టింది. ఏ విప్లవమైనా అంతే—దాని ప్రాముఖ్యత అది జరిగిన కాలంతోనే అంత మొందదు. తరవాత జరిగే చరిత్రనంతా ఇన్‌ఫ్లుయన్స్ చేస్తుంది. రష్యా విప్లవంకూడా అంతే !

ఏ విప్లవమైనా ఆనాటి సాంఘిక వ్యవస్థకు సంబంధించకుండా జరగదు. నలుగురు గూడుపుఠాణీ చేసి విప్లవాన్ని తయారు చెయ్యలేరు. ఒక ఆర్థికవిధానంవల్ల ఎక్కువమంది బాధపడేట ప్పుడు వాళ్ళందర్నీ కూడగట్టుకొని రాగలిగిన కార్యక్రమం వున్న ఉద్యమమే నెగ్గి సంఘాన్ని పైమెట్టుకు తీసుకుపోగలుగు

స్తుంది. ఎప్పుడైతే ఈవిషయం అంగీకరించామో అప్పుడే కొన్ని కొన్ని విప్లవాలు తరవాత జరిగబోయే విప్లవాలకు నాందిగాపని చేస్తవనికూడా అంగీకరించాలి. వెంటనే నాటకం ప్రారంభంఅవు తుంది. రకరకాలసీనులతో, రకరకాల సెట్టింగులతో సాగిపోతూ వుంటుంది. ఈవిధంగానే రష్యావిప్లవం ఒక విప్లవయుగానికి ప్రారం భోత్సవం జరిపింది. ఇక అనేకపనులు జరగవలసివున్నాయి. తెరపడేవరకూ రష్యావిప్లవమే వీటిని నడిపేశక్తిగా వుంటుంది. కాబట్టి రష్యావిప్లవాన్ని సవ్యంగా అర్థంచేసుకోవలసిన అవ సరం చాలావుంది.

రష్యావిప్లవంమీద అనేక పుస్తకా లున్నమాట నిజమే. కాని దానిస్వభావాన్ని గురించి అనేక అభిప్రాయభేదాలున్న వనే మాటకూడా మనం మరచిపోగూడదు. రష్యా విప్లవం ఎప్పుడుజరిగిందో, ఎంతమంది చచ్చిపోయారో, అధికార చ్యుతుడయిం తర్వాత కెరెన్స్కీ ఏమయ్యాడో, బోల్షివిక్ పార్టీ జారు కుటుంబాన్ని ఏంచేసిందో, రస్పుటీన్‌కి నిజంగా అంతఃపురంలో పలుకుబడివుందో లేదో, మొదలయినవివి షయాలకంటే, ఆ విప్లవస్వభావం తెలుసుకోవటం ముఖ్యం. ఇది తెలుసుకుంటేగాని ఇప్పుడు ప్రపంచంలో జరిగే విప్లవాలను మనం సక్రమమార్గాల్లో నడిపించలేం—ప్రపంచంలో జరిగే విప్లవాలకు సహాయభూతులం కాలేం.

ఈ పుస్తకంలో ఈ విషయం చాలా చక్కగా చర్చించ బడింది.

## III

"రష్యా విప్లవం ప్రజాస్వామిక విప్లవం అయితేనేమి, సోషలిస్టు విప్లవం అయితేనేమి?" అని చులకన చెయ్యకూడదు. మీరీ విషయాన్ని చులకన చెయ్యటం అంటే బ్రహ్మాండమైన విషయాన్ని, విప్లవమార్గాన్ని తారుమారు చేసే విషయాన్ని, చులకన చెయ్యటం అవుతుంది. మార్క్సిజానికే అపచారం చెయ్యటం అవుతుంది. మార్క్స్ "మనం విప్లవాలను శాసించలేం" అన్నాడు. అంటే విప్లవస్వభావం పరిస్థితులను బట్టి నిర్ణయింప బడుతుందిగాని మన అభిలాషనుబట్టి కాదని భావం. మీరు రష్యావిప్లవం ప్రజాస్వామిక విప్లవమైనా, సోషలిస్టు విప్లవమైనా భేదంలేదు అనుకున్నారంటే పై సిద్ధాంతానికి ద్రోహం చెయ్యటం అవుతుంది.

ప్రజాస్వామిక విప్లవానికి వేసుకోవలసిన కార్యక్రమం వేరు. సోషలిస్టువిప్లవానికి వేసుకోవలసిన కార్యక్రమం వేరు. సోషలిస్టు విప్లవ కార్యక్రమాన్ని ప్రజాస్వామిక విప్లవానికి తగిలిస్తే ఏమవుతుందో నేను వేరుగా చెప్పనక్కర్లేదనుకుంటాను. గుర్రానికి ముందు బండిని పెట్టి తోలటం అవుతుంది.

విప్లవానికి ముందు రష్యా మొత్తంమీద జమీందారీ విధానం కిందవుంది. జమీందారీవిధానం కిందవున్న రైతులు "భూమి మాకు కావాలి" అని కోరతారేగాని "భూమిని సంఘపరం చెయ్యాలి" అని కోరరు. అలాకాకుండా జమీందారీవిధానాన్నుంచి సోషలిజానికి ఒక్కగంతు వెయ్యటానికి వీలుందని అంగీకరిస్తే విప్లవాలు అవసరాన్ని బట్టి జరుగుతయ్ అనే సిద్ధాంతం

ఎగిరిపోయి ఏపదిమందో కలిసి విప్లవపాకాన్ని తయారుచెయ్యటానికి వీలుండనే తప్పుడుసిద్ధాంతాన్ని అంగీకరించవలసి వస్తుంది. ఎప్పుడైతే మనకీ దృష్టిదోషం కలుగుతుందో అప్పుడే మనపనులన్నీ విప్లవాన్ని నాశనంచెయ్యటానికి ఉపకరిస్తాయి. మనం సంఘానికి సహాయంచెయ్యలేకపోగా చేసేవాళ్ళకూడా చైనాగోడకిమల్లే అడ్డుతగులుతాం.

సంఘం తుక్కులతక్కెడగా నడవటంలేదు. సంఘానికికూడా కొన్ని నియమాలున్నాయి. నియమబద్ధంగా సంఘం పరిణామం చెందుతూవుంది. అలాకాకపోతే మనం ఈ సంఘంలో ఒక్కక్షణంకూడా జీవించటానికి వీలువుండేదికాదు. రేపు ఏం జరుగుతుందో మనం తెలుసుకోగలిగేవాళ్ళం కాదు. రేపు ఏంజరుగుతుందో తెలుసుకోలేనప్పుడు, ఏదైనాజరగటానికి వీలున్నప్పుడు, మన జీవితాల్లోమాత్రం ఒక పద్ధతి వుంటానికి ఎట్లా వీలవుతుంది? పశువులకుమల్లే బతకాల్సి వొచ్చేది. ప్రపంచం పిచ్చి ఆసుపత్రి అయ్యేది, ముక్కలు చెక్కలయ్యేది.

ప్రతి సాంఘికవ్యవస్థలోనూ రాబోయే సాంఘికవ్యవస్థ బీజాలు వృద్ధిచెందుతూవుంటాయి. వాటిని పురస్కరించుకొని మాత్రమే మనం సంఘంలోమార్పులు తీసుకురాగలం. వాటికి భిన్నమైన మార్పులుగాని, వాటికి సంబంధంలేని మార్పులుగాని, మానవుడు చచ్చి గీపెట్టినా తీసుకురాలేడు.

అయితే ఇందుకు మానవప్రయత్నం ముఖ్యావసరం. రాజకీయాధికారంలో వున్న పార్టీ ఈ పరిణామాన్ని నిరోధించ

గలదు—ఉత్సాహపరచగలదు. అందుకే మార్క్సు శ్రామికులను రాజకీయాధికారాన్ని చేపట్టవలసిందని హెచ్చరించాడు.

వీటినిబట్టి చూస్తే, రష్యావిప్లవం సోషలిస్టువిప్లవం అనుకోటం ఎంత ఘోరమైనప్రమాదమో మీకు బోధపడుతుంది. ఇలా అనుకోటంవల్ల కొన్ని పార్టీలు అనేకతప్పుదార్లు తొక్కి—అనేకదేశాల్లోని బీదప్రజలకు తీరనిఅపకారం చేసినై. మన దేశంలోవున్న కమ్యూనిస్టుపార్టీ ప్రోలిటేరియట్ నియంతృత్వం కావాలనీ, స్ట్రయిక్‌వల్ల ఇది సాధింపబడుతుందనీ ప్రచారంచేసిన రోజులూ, వాటివల్ల వొచ్చిన దుష్ఫలితాలూ, మీఅందరికీ తెలిసేవుంటవనుకుంటాను.

కాని రష్యావిప్లవం సోషలిస్టు విప్లవం అని పొరపాటు పట్టానికూడా ఒక కారణంవుంది. అదికూడా మనం తెలుసుకోవాలి. రష్యావిప్లవం ప్రజాస్వామిక విప్లవమే అయినా సోషలిజం కావాలనే నాయకత్వంకింద నడిచింది. నాయకత్వాన్నిబట్టి, విప్లవ స్వభావాన్ని నిర్ణయించుకొని పొరపాటు పడ్డారు కొందరు. కాని బోల్షివిక్‌పార్టీ ఆదర్శం సోషలిజం అయినా, ప్రజాస్వామిక కార్యక్రమంతోనే పనిచేసి నాయకత్వం సంపాదించిందనే విషయం వీళ్లు గమనించలేదు. అయితే సోషలిజం ఆదర్శంగావున్న పార్టీ ప్రజాస్వామిక విప్లవానికి నాయకత్వం సంపాదించ గలిగింది గనకే మరొక విప్లవంలేకుండా సోషలిజం స్థాపించటానికి వీలయింది కూడాను.

ఇవి మనం రష్యావిప్లవాన్నించి నేర్చుకోవలసిన గుణ పాఠాలు. కాని ఈపుస్తకం మరొక హెచ్చరికకూడా చేస్తూ వుంది. రష్యావిప్లవం నెగ్గిందిగనక, తరవాత వొచ్చే విప్లవాలను అదే కమ్మెచ్చులో లాగాలనుకోవటం కేవలం పొరపాటు. ఎందుకంటే ప్రపంచం క్షణక్షణం మారుతూవుంటుంది. ఎప్పు డయితే పరిస్థితులు మారతయ్యో అప్పుడే విప్లవకారులు తమపద్ధతులనుకూడా మార్చుకోవలసివుంటుంది. అలాచెయ్యక వెనకజరిగిన విప్లవాల్లాగానే మనమూ చెయ్యాలనీ, ఆపార్టీల నాయకుల సిద్ధాంతాలే మనమూ ఆచరించాలనీ, ఆ పార్టీల నిర్మాణాన్నే మనమూ కాపీచెయ్యాలనీ కూర్చుంటే అవ కాశాలు మనచేతుల్లోనుంచి జారిపోతయ్యనీ, విప్లవవ్యతిరేకు లకు బలంచేకూర్చిన వాళ్ళం అవుతామనీ మనం గ్రహించాలి. ఈ గ్రహింపు లేకపోవటంవల్లా, రష్యావిప్లవం జరిగినట్టుగానే మన దేశంలోనూ విప్లవం జరపాలని అనుకోవటంవల్లా, భారత కమ్యూనిస్టుపార్టీ వేసిన తప్పటడుగులూ, దేశానికి చేసిన అపకారం మనందరికీ తెలిసిందే.

1914 లో జరిగిన యుద్ధం ఇంపీరియలిస్టు యుద్ధమని లెనిన్ అన్నాడు గనక మన కమ్యూనిస్టుపార్టీ ఈయుద్ధాన్నికూడా ఇంపీరియలిస్టు యుద్ధం అన్నది. అక్కడ బోల్షివిక్ పార్టీ అధి కారంలోకి రాకముందు కెరెన్స్కీ ప్రభుత్వం అధికారానికి వొచ్చింది గనక ఇక్కడకూడా తాను అధికారంలోకి రాక ముందు జాతీయప్రభుత్వం రావాలనికోరుకుంటూవుంది. అంతే

గాని ఈ రెండుయుద్ధాల మధ్యా ప్రపంచం చాలా మారిందనీ, ఆయుద్ధానికీ ఈయుద్ధానికీ భేదం వుందనీ, అప్పుడులేని సోసిస్టు దేశాలూ ఒక సోషలిస్టు దేశం ఇప్పుడు ప్రపంచంలో వుంటం తటస్థించిందనీ, వర్గసంబంధాలుపూర్తిగా మారినయ్యనీ, దానివల్ల తమపద్ధతిని మార్చుకోవాలనీ వీరు గ్రహించలేదు.

ఈ పుస్తకం విప్లవాలనుకావీకొట్టాలనే గుణాన్ని తీవ్రంగా విమర్శించి ఎప్పటికప్పుడు పరిస్థితుల్నిబట్టి కార్యక్రమం వేసుకోవాలని బోధించి విప్లవంచెయ్యాలనుకునేవాళ్ళకు చక్కని దృష్టి ఏర్పట్టానికి సహాయంచేసింది.

రష్యావిప్లవం మార్క్సిజానికి ఏ విధంగానూ వ్యతిరేకంగా జరిగిందికాదు. అసలు మార్క్సు చెప్పిందేమిటి? సంఘం ఎట్లా పరిణామం చెందుతూవుందో చెప్పాడు. కేపిటలిస్టు ఆర్థిక విధానంలో, క్రమక్రమేణాడబ్బుకొద్దిమంది చేతుల్లో పేరుకుంటుందనీ, ఎక్కువమంది వీళ్ళవల్ల దోచుకో బడతారనీ, ఈ దోచుకోబడేవాళ్లు రాజకీయ అధికారాన్ని చేపట్టితే తప్ప దోపిడీవిధానం నాశనంకాదనీ చెప్పాడు. చరిత్ర అతను చెప్పిందంతా నిజమేనని రుజువు చేసింది. పరిశ్రమలు బాగా వృద్ధి చెందినచోట విప్లవం జయించటానికి అనుకూల పరిస్థితులు ఏర్పడతయ్యనీ, కార్మికులు అధికారంలోకి రాగానే ప్రోలిటేరియన్ నియంతృత్వం స్థాపించి, శత్రువర్గాలనుంచి ప్రభుత్వాన్ని రక్షించుకోవాలనీ, క్రమక్రమేణా వర్గాల్లేని సంఘం ఏర్పడి, ప్రభుత్వం అవసరం లేకపోవటంవల్ల, దానంతట అదే రాలిపోతుందనీ చెప్పాడు.

మార్క్సుతర్వాత, ఇప్పటివరకూ జరిగిన మానవచరిత్రని పరిశీలిస్తే, అతని ఎనాలిసిస్ రైటేననీ తేలిగ్గా బోధపడుతుంది. అయితే రష్యావిప్లవం సోషలిస్టు విప్లవం అనుకున్నవాళ్ళు ఈ మధ్యచాలా గందరగోళం చేసినమాటమాత్రం వాస్తవం. రష్యా విప్లవం మార్క్సు సిద్ధాంతం తప్పని రుజువుచేసింది అనేమాట అక్కడక్కడా వినిపిస్తూవొచ్చింది కూడాను. మార్క్సు పరిశ్రమలుబాగావృద్ధిచెందించోటవిప్లవంనెగ్గుతుందిఅనిచెప్పాడు పరిశ్రమలు వృద్ధిచెందిన దేశాలు అల్లావుండగానే పరిశ్రమలు వృద్ధిచెందని రష్యాలో విప్లవం నెగ్గిందికనక మార్క్సువాదం తప్పుఅని వీరి ఉద్దేశం అయినట్లు కనిపిస్తుంది.

ఇది బొత్తిగా అర్థంలేని వాదం. మార్క్సు పరిశ్రమలు వృద్ధిచెందిన దేశాల్లో విప్లవంనెగ్గే అవకాశాలు ఎక్కువ వుంటాయని చెప్పినప్పుడు, అతనిఉద్దేశం సోషలిస్టువిప్లవం అని. సోషలిస్టువిప్లవం తప్ప ఇక విప్లవాలులేవని అతడుచెప్పలేదు. పైగా అనేకవిప్లవాలు జరిగే, సంఘం కేపిటలిస్టుదశకు వొచ్చిందనే విషయం అందరికీతెలిసినవిషయమే! అయితే ఆయా విప్లవస్వభావాలు ఆయా సాంఘికవ్యవస్థలను బట్టి ఏర్పడుతూ వుంటై. ఈలెక్కనే, రష్యాప్రజలను కుంగగొడుతున్న జమీందారీవిధానంమీదకి ప్రజాస్వామికవిప్లవం చెలరేగింది. సుబ్బారావుచెప్పినట్టు "తిండి, శాంతి, భూమి" అనే నినాదంకింద దిగ్విజయంగా జరిగింది. ఇది ప్రజాస్వామిక విప్లవ నినాదమేగాని సోషలిస్టు విప్లవ నినాదంకాదు.

ఈ తికమకలకు తగినట్టు మార్క్సు ఉపయోగించిన 'ప్రోలి టేరియన్ నియంతృత్వం,' అనేమాటకూడా అనేక అపార్థాలకు తావిచ్చింది. నియంతృత్వం అనగానే కొద్దిమంది ఏలే ప్రభుత్వం అని మనకు అర్థం అవుతుంది. కనక ప్రోలిటేరియన్ నియంతృత్వం అనగానే సంఘంలో మైనారటీలో వున్న కార్మికుల ప్రభుత్వం అని వీరు అర్థం చెప్పుకున్నారు. ఈ వాదం మళ్ళీ ఏ కొద్దిమందో, మెజారిటీ ఇష్టంలేకపోయినా, విప్లవం చెయ్యొచ్చనేవాదాన్నే బలపరుస్తూంది. అందుకనే వీళ్లు 1917లో రష్యాలో కార్మికులు సంఖ్యలో తక్కువగావున్నా సోషలిస్టు విప్లవం చెయ్యగలిగారనీ, అల్లాగే అన్ని దేశాల్లోనూ జరగటానికి వీలుందనీ, ప్రచారం చేశారు.

మార్క్సు ఉపయోగించిన ఒకమాటను పూర్వాపరసంబంధంలేకుండా అర్థంచేసుకోటంవల్ల ఏర్పడ్డ దురవస్థ ఇది. మార్క్సు ప్రోలిటేరియన్ నియంతృత్వం ఎప్పుడు అవసరం అన్నాడు? పరిశ్రమలు బాగా వృద్ధిచెందిన దేశంలో విప్లవం నెగ్గినప్పుడు. పరిశ్రమలు బాగా వృద్ధిచెందిన దేశంలో కార్మికులు మెజారిటీగానే వుంటారనే సంగతి మనకు అందరికీ తెలిసిన విషయమే! కాబట్టి అతడు చెప్పిన ప్రోలిటేరియన్ నియంతృత్వం మెజారిటీ ప్రభుత్వమే అవుతుంది. అయితే నియంతృత్వం అని ఎందుకన్నాడు? ప్రభుత్వాన్ని పడదొయ్యటానికి ప్రయత్నించే రియాక్షనరీ వర్గాల విషయంలో దాని స్వభావాన్ని చెప్పటానికి మాత్రమే ఈ పదం వుపయోగించాడని తేలుతుంది.

నాటిక్ "కమ్యూనిజం ఎగుమతి కావట్టానికివీలయిన సరుకు కాదు." నాణ్నాడింతే దీని భావం ఏమిటో మనం ఆలోచించు కుంటే సరిక్రం బోధపడక పోదు. సరే ఇక విప్లవండి చూడదలుచు కోని వాళ్ళమాటా, చెవులువుండీ వినదలుచుకోనివాళ్ళ మాటా అంటారా? వాళ్ళకు ఇంతకంటే ఎక్కువ చెప్పి ప్రయోజనంలేదు.

౬

ఈ పుస్తకంలో సుబ్బారావు ఈ విషయాలన్నీ విపులంగా చర్చించి తన విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చుకున్నాడు. రష్యా విప్లవ స్వభావాన్ని తార్కాణాలతో స్పష్టపరచి విప్లవకారులకు సహాయంచేశాడు. బోల్షివిక్ పార్టీ కార్యక్రమాన్ని విపులీకరించి, సోషలిజం సాధించటానికి వారి ప్రయత్నాలను విపులపరచి, మన దేశంలోని తీవ్రవాదులకు సహాయం చేసాడు.

సుబ్బారావు చక్కగా రాయగలడు. గంభీరంగాఉపన్యాసం ఇవ్వగలడు. ఏం చేసినా ఇప్పటి సాంఘిక వ్యవస్థమీాద అతని కున్న అసంతృప్తి స్పష్టంగా గోచరిస్తూ వుంటుంది. ఈ అసంతృప్తే అతనిలోనుంచి తెరలు తెరలుగా బయటపడే ఆవేశానికి కారణం.

అతని ఆవేశం, అతనిస్నేహితులూ విరోధులూ అప్పుడప్పుడూ రుచి చూస్తూనే వుంటారు గాని ఒకే రాజకీయ పార్టీలో కలిసి పనిచేస్తున్న నాకు తెలిసినంతగా ఇతరులకు తెలియదను కుంటాను! తాను నమ్మిన దాన్ని చులకనగా మాట్లాట్టం, తేలిగ్గా చూట్టంకూడా అతడు సహించలేడు. ఎంతమందితో

పోట్లాడుతూ వుంటాడని! అతను పోట్లాడుతూవుంటే చూసే వాళ్ళకి—అందరికీ వున్నా లేకపోయినా నాకు మాత్రం—చాలా ఆసూయగా వుంటుంది. మనసం నమ్మిందే అతనూ నమ్మాడు; అతను నమ్మినదాన్నిగట్టిగా మనమూ నమ్మాం—కాని అతనికిమల్లే మనం ఎందుకు పోట్లాడలేం? అనిపిస్తుంది. మనలో సిన్సియారిటీ తక్కువేమోనని భయం వేస్తుంది. ముసలివాళ్ళం అయ్యామేమో అని గాభరా పుడుతుంది.

ఇందువల్లే కామ్రేడ్లు సుబ్బారావు అంటే బాగా ప్రేమించే వాళ్ళూ, తీవ్రంగా అయిష్టం చూపేవాళ్ళూ వున్నారు.

"సుబ్బారావు అంటే ఎంత ఇష్టం!" అన్నవాళ్ళని నేను ఎరుగుదును.

"ఎందుకని?"

"చాకల్లే వుంటాడు. ఎత్తితే పోట్లాడుతాడు."

"అదేమిటండీ సుబ్బారావు?" అనేవాళ్ళని కూడా నేను ఎరుగుదును.

"ఏం?"

"మాట్లాడితే పోట్లాడుతాడు!"

సంఘంలో బాగా ప్రేమించేవాళ్ళూ తీవ్రంగా అయిష్టతను చూపేవాళ్ళూ ఉండటం కంటే ఏం కావాలి? ఇది ఆరోగ్యచిహ్నం అని నాఅభిప్రాయం.

3

ఈమధ్య కొన్నాళ్ళనుంచి మార్క్సిజాన్ని గురించీ రష్యా విప్లవాన్ని గురించీ దుష్ప్రచారం జరుగుతూ వుంది.

బ్రిజినారాయణ రాసిన "మార్క్సిజం మరణించింది" అనే పుస్తకం, మసానీ రాసిన "సోషలిజం రికన్సిడర్డ్" అనే పుస్తకం మీలో చాలామంది ఈపాటికి చదివే వుంటారు అనుకుంటాను.

ఈ రచయితలు ఇదివరకు వాళ్లకు మల్లే కాకుండా చాలా తెలివితేటలుగా వ్యతిరేక ప్రచారం చేస్తున్నారు. "సోషలిజం మంచిదేగాని ఇప్పుడున్న పరిస్థితుల్లో అది ఆచరణ యోగ్యం కాదు," అంటారు. "రష్యా విప్లవం చాలా గొప్ప విషయం. కాని స్టాలిన్ వున్నాడు చూశారూ, అతడు ఆవిప్లవాన్ని నాశనంచేసి సోషలిజానికి ద్రోహంచేశాడు," అంటారు. "రష్యాలో జీతాల్లో హెచ్చు తగ్గు లున్నాయి. స్టాలిన్ అంతర్జాతీయ దృష్టిని వొదులుకొని, సంకుచిత జాతీయవాదాన్ని ఆచరణలోకి తెస్తున్నాడు. సంకుచిత జాతీయవాదం నిరంకుశత్వానికి జేరుస్తుందని నేను వేరుగా చెప్పనక్కర్లేదు. స్టాలిన్ లెనిన్‌కి ఎంత ద్రోహం చేశాడు!" అని విమర్శిస్తున్నాడు మసానీ.

బ్రిజినారాయణ 'మార్క్సిజం మరణించింది' అని నిరూపించటానికి ఒక గమ్మత్తుచేశాడు. మార్క్సిజం అంటే ఏమిటో తను విమర్శించుకోటానికి వీలయిన ఒకబొమ్మని ముందుగా తయారుచేసిపెట్టుకొని తన విమర్శలతో దానికి తూట్లుపొడవటం మొదలుపెట్టాడు. తాను పొడవదలచినతూట్లు పూర్తవగానే 'మార్క్సిజం మరణించింది' అని డిక్లేర్‌చేశాడు. అంతేగాని తన ఊహలో తాను సృష్టించుకున్న బొమ్మకుమాత్రమే తాను నిర్యాణం ప్రసాదించాడుగాని అసలు మార్క్సిజం బతికేవుందని అతనికి తట్టలేదు. అతడు తన్ను తానే మోసం

చేసుకొని తృప్తిపడ్డాడు— "మార్క్సిజం మరణించింది" అనుకున్నాడు.

ఇక మసానీపరిస్థితి వేరు. అతను సోషలిజం రావలసిందేగాని ప్రస్తుతం మానవుని మనస్తత్వం అందుకు అనుకూలంగా లేదనీ స్టాలిన్ జాతీయవాదిగా మార్చి రష్యావిప్లవానికి ద్రోహంచేశాడనీ వాదిస్తాడు.

ఒక దేశంలోనే కార్మికవర్గం అధికారానికి వొచ్చినప్పుడు, చుట్టుపక్కల కేపిటలిస్టు దేశాలు వుండి ఆ ప్రభుత్వాన్ని నాశనం చెయ్యటానికి ప్రయత్నిస్తూ వున్నప్పుడు, ఆ దేశంలో కల్తీ లేని సోషలిజం తీసుకు రాటానికి వీలుపడదనే విషయం అందరికీ తెలిసిందే! రష్యాకు ఈపరిస్థితేవొచ్చింది. జీతాల్లో హెచ్చుతగ్గులుంటానికిగానీ మసానీ చూపించిన మరికొన్ని లక్షణాలుంటానికిగానీ ఇదే కారణం.

అయితే సోషలిజానికి ముఖ్యలక్షణం అయిన "ఉత్పత్తి సాధనాలు సంఘం చేతుల్లో వున్నంద్" గనకా, "కేపిటల్ వ్యక్తుల లాభానికి ఉపయోగించే వీల్లేదు" గనకా ఈదారి తప్పకుండా సోషలిజానికి తీసుకువెళ్తూ వుందని మనం చెపుతున్నాం.

మసానీ వేసిన 'జాతీయవాదం' అనే నిందకూడా కొత్తది కాదు. స్టాలిన్ ట్రాట్స్కీ తగాదాల్లో ట్రాట్స్కీ ఈమాటే అన్నాడు. "ఒక దేశంలో సోషలిజం స్థాపించటానికి వీల్లేదు గనక ఇతర దేశాల్లో విప్లవాలు తీసుకురాటానికి మనం ముఖ్యంగా ప్రయత్నించాలి" అన్నాడు.

బాగానే వుంది. ఒక్క దేశంలో సోషలిజం స్థాపించటానికి వీల్లేదనేమాట నిజమే! ఆమాట ట్రాట్స్కీయే కాదు, స్టాలిన్ కూడా వొప్పుకున్నాడు. కాని ఇక ఏం చెయ్యాలి? ఒక దేశంలో సోషలిజం తేటానికి వీల్లేదు గనక అధికారం వొదులుకు పోవాలా? పోనీ ట్రాట్స్కీ చెప్పినట్టు ఇతర దేశాల్లో విప్లవాలను తీసుకురాటానికి ప్రాధాన్యత ఇవ్వాలంటే ఇతర దేశాల్లో పరిస్థితులు అందుకు అనుకూలంగా లేవు. అప్పటికి విప్లవాలు రావటం ఓడిపోవటం జరిగింది. ఆయా దేశాల్లో పరిస్థితులను బట్టి విప్లవాలు వొస్తయ్ గాని పైనుంచి ఏర్పాటు చెయ్యలేం. ఇకేం చెయ్యాలి? కాల్నిలోవ్ కో లేకపోతే కెరెన్స్కీకో వీలైతే జారుకో మళ్లీ అధికారాన్ని అప్పగించి 'విప్లవ పంథా' లోకి పోవటమా? కాదు. ఇతర దేశాల్లో అనుకూలపరిస్థితులు రావటానికి సహాయంచేస్తూ, ప్రధానంగా కేపిటలిస్టు దేశాల నుంచి తన్ను తాను కాపాడుకుంటూ, సోషలిజానికి వీలైనంత వరకు దారిని ఏర్పరచుకోవటం అవసరం. ఇదీ స్టాలిన్ వాదం. ఈపనే స్టాలిన్ చేశాడు. ఆపరిస్థితుల్లో ఇంతకంటే చేసేదేమీలా లేదని దృష్టిదోషంలేని ప్రతివాడూ అంగీకరించి తీరాలి.

ఈసంగతి మసానీ తెలుసుకుంటే అతనిపుస్తకంలో పాతిక పేజీలు రాయవలసిన అవసరం వుండేదేకాదు. అంటే మిగిలిన పాతిక పేజీలూ రాయాల్సినఅవసరం వుందని నాఉద్దేశం అనుకునేరు! రష్యాలో జరిగింది ప్రజాస్వామికవిప్లవంగాని సోషలిస్టు విప్లవంకాదని తెలుసుకుంటే మిగిలిన పాతిక పేజీలూ రాయవల

సిసఅవసరంకూడా వుండేదికాదు మసానీకి. కాని అప్పుడు ఈ బొంబాయి మేయరు గాంధీయిజాన్ని పొగిడేఅవకాశం వుండదు!

జమీందారీవిధానంలో నుంచి సోషలిజంలోకి రాటానికి మానవమనస్తత్వం, సంస్కారం చాలా మారివలసినమాట యదార్థం. అందువల్లే రష్యాలో ఇంతకాలం తీసుకుంది. అలా కాకుండా పూర్తిగా కేపిటలిజం అభివృద్ధిచెందిన దేశంలో మాత్రం సోషలిజానికి ప్రజలసంస్కారం సరిపోయేవుంటుంది. లెనిన్ రష్యావిప్లవం నెగ్గింతర్వాతకూడా, యూరపులో పరిశ్రమలు వృద్ధిచెందినదేశంలో విప్లవం నెగ్గితే ఆ దేశం ప్రపంచ కార్మికులకు నాయకత్వం వహిస్తుందని చెప్పటానికి ఇదేకారణం.

అంతేగాని ఈనాటి మానవులమనస్తత్వం సోషలిజానికి అనుకూలంగా లేదనీ, అందువల్ల మరొక కొత్తఇజం కావాలనీ మసానీ రాయడంలో అర్థంలేదు— చాటుమాటుగా ఫేసిజం తేదలిస్తే తప్ప.

పోనీ, మీరు ఇంకొకరకంగా ఆలోచించిచూడండి. స్టాలిన్ తన దేశ శ్రేయస్సుకోసం పెద్దసైన్యాలను సృష్టించలేదు అనుకుందాం. శత్రువర్గాలపట్ల నియంతగా ప్రవర్తించలేదు అనుకుందాం. మొదటినుంచీ ఇతర దేశాల వ్యవహారాల్లో జోక్యం కలిగించుకున్నాడు అనుకుందాం. అప్పుడేమయ్యేది? కేపిటలిస్టు దేశాలన్నీ ఏకంకావటం, ఈపాటికి రష్యా నాశనంఅవటం జరిగేది. ప్రపంచం ఫాసిస్టువిధానంకిందకు ఏనాడో పోయేది. అంతవరదాకా అక్కర్లేదు. తాను పెంపొందించిన శక్తితో జర్మనీకి అడ్డుతగిలకపోతే ఈపాటికి ప్రపంచం ఏమయ్యేది?

ముస్సోలినీ ఇంతగా ప్రేమిస్తున్న హిందూదేశం ఏమయ్యేది? ప్రపంచంలో వున్న బీదప్రజలందరూ ఈపాటికి మాడిపోయే వారు. సోషలిజం లేదనేవంకతో, రష్యానీ స్టాలిన్నీ ముస్సోలినీ నిందిస్తున్నాడంటే— వంకేయేదైనా—అతని ఉద్దేశం తెలుసు కోవటం కష్టంకాదు.

మూడో అంతర్జాతీయ సంస్థని రద్దుచేసినందుకూడా ముస్సోలినీ స్టాలిన్ని విమర్శిస్తున్నాడు. స్టాలిన్ అవలంబిస్తున్న జాతీయ విధానమే దీనికి కారణం అంటున్నాడు. అంతేగాని ఏనాడు స్టాలిన్ "కమ్యూనిజం ఎగుమతి చెయ్యటానికి వీలయిన సరుకు కాదు" అని చెప్పాడో ఆనాడే మూడో అంతర్జాతీయ సంఘం అనవసరం అయిందని ఇతడు గ్రహించలేదు. ఈ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఎందుకు ఏర్పడింది? దాని ఆదర్శం ఏమిటి? ఆ ఆదర్శాన్ని ఎట్లా సాధించదలిచింది? ఈ ప్రశ్నలకు జవాబులు తెలుసుకుంటే గాని మనకు మంచీ చెడ్డా తెలియదు.

మూడో అంతర్జాతీయ సంస్థ రష్యా విప్లవం తర్వాత ఏర్పడ్డ సంస్థ అనే విషయం మీకు తెలిసిందే. ఇది ప్రత్యేకం కార్మికుల సంస్థ. కార్మికవిప్లవం, ప్రోలిటేరియట్ నియంతృత్వం కావాలని పాటుబడే సంస్థ. కాని జర్మనీలో ఫాసిజం అధికారం లోకి వొచ్చిన తర్వాత పరిస్థితులు మారినయ్. ఫాసిజాన్ని నాశనం చెయ్యటం విప్లవవాదుల ప్రథమ కర్తవ్యం అయింది. అందుకు ఒక్క కార్మికులే కాదు, మరికొన్ని వర్గాలుకూడా సిద్ధపడినయ్. కార్మికులు వాళ్లతో కలిసి పనిచెయ్యవలసిన అవసరం ఏర్పడింది. అప్పుడు కార్మికసంస్థ అవసరంతీరిపోయింది.

ఫాసిజం ఒక్క కార్మికవర్గం విరోధిమాత్రమే కాదు. మానవులు గత వందసంవత్సరాలనుంచీ సృష్టించుకున్న నాగరికతకూ సంస్కారానికీ రాజకీయ సూత్రాలకూ—అన్నిటికీ విరోధే! ప్రజాస్వామిక సూత్రాలను రద్దుచేసి మానవుల్ని జమీందారీ నాగరికతలోకి తీసుకుపోవాలనే సిద్ధాంతం ఫాసిజం. అందుకని ఒక్క కార్మికులే కాక ప్రజాస్వామిక వాదులు కూడా దాన్తో పోరాట్టానికి సిద్ధపడ్డారు. దీనివల్ల వర్గకలయికలో మార్పు జరగవలసిన అవసరం కలిగింది.

ప్రపంచపరిస్థితుల్లో ఈ మార్పుని గమనించి రష్యా తన పద్ధతిని మార్చుకుంది. ప్రజాస్వామిక దేశాలతో చేతులు కలపటం మొదలుపెట్టింది. అనేక నిరాక్రమణ సంధులను చేసుకుంది. నానాజాతి సమితిలో చేరింది. పీపుల్స్‌ఫ్రంట్ ఉద్యమాన్ని ప్రారంభించింది. రష్యా ఎప్పుడైతే ఈ నూతనవిధానాన్ని అనుసరించటం మొదలుపెట్టిందో, అప్పుడే కార్మికులకు ప్రత్యేక సంస్థ అనవసరం అయింది. అనవసరం అవడమేకాదు. అపాయకరంకూడా అయింది. అందువల్ల మూడో అంతర్జాతీయ సంస్థ రద్దుచెయ్యబడింది.

పరిస్థితులనుబట్టి రష్యా తన పద్ధతిని మార్చుకున్నందుకు మనం సంతోషించాలి. రష్యా తనపద్ధతిని మార్చుకొని వుండకపోతే ఈపాటికి ప్రపంచం తునాతునకలై వుండేది.

కాని మసానీకి ఈమార్పు చాలా కంటకంగావుంది. "లెనిన్ నానాజాతి సమితిని 'దొంగలగుంపు' అన్నాడే!.. అటువంటి

దాంట్లోచేరి స్టాలిన్ లెనిన్‌కి ఎంత ద్రోహం చేసాడు!" అంటున్నాడు.

మనానీ, మార్క్సుమీదా, సోషలిజంమీదా అవ్యాజానురాగం ఎందుకుచూపుతున్నాడో మీకు ఇప్పటికి అర్థంఅయి ఉంటుందనుకుంటాను. అతను మార్క్సుని పొగిడేది స్టాలిన్ని తిట్టిపొయ్యటానికి. సోషలిజాన్ని పొగిడేది రష్యాని విమర్శించటానికి.

చరిత్రలో ఇల్లాంటి సానుభూతిపరుల్ని మనం చాలా మందిని చూశాం. ఇటువంటి 'మిత్రు'లను మనం చాలామందిని ఎరుగుదుం. సమయంవొచ్చినప్పుడు సోషలిజానికి వీరే మాత్రం సహాయంచేస్తారో, ఏశిబిరంలో జేరతారో కూడా మనకు తెలుసు—కనక ఈ వగలుఏడ్పులకు మనం చీకాకుపడనక్కర్లేదు. ఫాసిస్టుల విరోధం, వీళ్ళప్రేమా, రెండూ మనకు ఒక్కటే! ఒకలెక్కలో వీళ్ళప్రేమే ఎక్కువ అపాయకరమైందేమో!

౪

మార్క్సు పరిశ్రమలు అభివృద్ధి చెందిన దేశంలో విప్లవం వొస్తే ఏంచెయ్యాలో చెప్పాడు. రష్యా విప్లవం, లెనిన్ నాయకత్వాన, పరిశ్రమలు అభివృద్ధి చెందని దేశంలో విప్లవం నెగ్గాలంటే ఏంచెయ్యాలో, నెగ్గింతర్వాత ఏంచెయ్యాలో చెప్పింది.

ఇది మనకు చాలా ముఖ్యం. ఎందుకంటే విప్లవానికి ముందున్న రష్యాకీ మన దేశానికీ చాలాపోలికలున్నాయి. రెండు

దేశాలూ జమీందారీ విధానంకింద వున్న దేశాలే! రెండు దేశాల్లోనూ అక్కడ జరిగిందీ ఇక్కడ జరగవలసిందీ ప్రజా స్వామిక విప్లవమే!

ప్రజాస్వామిక విప్లవంలో, సోషలిజం కావాలనుకునేవాళ్లు కూడా ప్రజాస్వామిక వాదులుగానే పాల్గొని నాయకత్వం సంపాదించాలి. ప్రపంచం ఇప్పుడున్న పరిస్థితుల్లో ఈఅవసరం మరీ ఎక్కువైంది.

కేపిటలిజం తన పాత్రను నిర్వహించుకొని, అభివృద్ధి నిరోధకంగా తయారయి వుంది. అటువంటప్పుడు కేపిటలిజం నిలబడాలంటే ఫాసిజంగా మాత్రమే నిలబడ గలుగుతుంది. కాబట్టి నాయకత్వం వాళ్ళకు వొదిలితే మనకు ఫాసిజమే గతి అవుతుంది.

ఈవిషయాలన్నీ మనం రష్యావిప్లవాన్నుంచి నేర్చుకున్నాం. అయితే మాకు రష్యావిప్లవాన్ని కాపీకొట్టాలనే అభిలాష కలిగిందా చచ్చామే! రష్యా విప్లవంలో జరిగిన పొరపాట్లు మనం మళ్ళీ చెయ్యనక్కర్లేదు. రష్యావిప్లవం సోషలిస్టు విప్ల వంఅని ఒకప్పుడు ఆదేశం నాయకులు అనుకున్నా, మనం అనుకోవలసిన పనిలేదు. విప్లవం నెగ్గగానే వాళ్ళు సోషలిస్టు కార్యక్రమం ప్రవేశపెట్టటానికి ప్రయత్నించారని మనం ప్రయ త్నించవలసిన అవసరంలేదు. ఆ కార్యక్రమం రైతులమీదకు దౌర్జన్యంగా నెట్టటానికి ప్రయత్నించారు గనక మనంకూడా ఆపనేచెయ్యాలనుకోగూడదు. ఎందుకంటే ఇవన్నీ పొరపాట్లని

వాళ్ళు అంగీకరించారు. లెనిన్ 1921 లో ప్రవేశపెట్టిన నూతన ఆర్థికవిధానం ఈ కొత్తదృష్టికి దృష్టాంతరం.

ఇప్పటికే చాలా కాలయాపనఅయింది. పరిచయం పేరుతో ఇదంతా చెపుతూవుంటే మీక్కూడా విచిత్రంగా వుండొచ్చు. అంతేకాకుండా నేను చెప్పదలిచిందికూడా అయిపోయింది. డంగన్ ఫోక్ సాంగ్స్‌లోని ఒకపద్యంతో ఈపరిచయం ముగిస్తున్నాను.

Wonder of wonders !
all poor have become
one family, joining hands
Let Justice and Wisdom
have their way
and the people rule their land
So dazzling a sun
hath never shed its light
on the earth before
Lenin proclaimed
"Let brotherly love prevail
among the poor."

— గోపీచంద్

నూతాశ్రమం

ప్రాతికసంవత్సరాల క్రిందట రష్యాలో విప్లవం జరిగిందన్న విషయం అందరూ వినేవుంటారు. ఆ విప్లవం జరక్కు మునుపు రష్యా, రష్యాగా వుండే దేకాదనీ, ప్రజలంతా అజ్ఞానాంధకారంలో బడి కొట్టుకుపోతూ వుండేవారనీ, మొరటుజాతుల్లో రష్యా మొదటిదిగా వుండేదనీ, అక్కడస్త్రీలను గడపదాటి బైటకు రానిచ్చేవారు కాదనీ, వ్యభిచారం చాలా ఎక్కువనీ, జనాభాలో నూటికి 99 మంది నిరక్షరాస్యులనీ, అప్పుడు రష్యాలో వున్న జమీందారీ విధానము ఫ క్తయిన జమీందారీ విధానమనీ, ఆ విధానం క్రింద రష్యాజాతి యావత్తూ దోపిడీ విధానానికి గురియై, బానిసత్వంలో కుళ్ళిపోయి వుండేదనీ కొందరు చెపుతూవుంటగా మీరు వినే వుంటారు. అంతేకాదు. పాతిక సంవత్సరాలనాడు రష్యాలో జరిగిన ఆ విప్లవం సోషలిస్టు విప్లవమనీ, సోషలిజం సర్వరోగ నివారిణి గనక, యీనాడు రష్యాలో ఆర్థిక, రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మిక మరే యితర రోగాలు మచ్చుకైనా లేకుండా నశించి పోయిననీ, రష్యాలో యీర్ష్యలకు, అసూయకు, ద్వేషాలకు, స్వార్థానికి

చోటే లేదనీ, రష్యా ప్రజల్లోని భౌతిక, మానసిక, మాలిన్యాన్నే యీ విప్లవం వృతికి గుంజివేసిందనీ, మన పూర్వులూ, మానసిక నాగరకతలేని యీనాటి కొందరు మూర్ఖులూ చెప్పుకొనే స్వర్గాన్ని, యీనాడు రష్యాలో ప్రవేశపెట్టారనికూడా కమ్యూనిస్టులమని చెప్పుకొనేవారు కొందరు మన గ్రామాలకువచ్చి చెప్పి పోతూ వుంటారన్న సంగతికూడా మీకు తెలుసు.

పైనచెప్పిన విషయాలు అన్నీ నిజం కావొచ్చు, కాక కొన్ని నిజంకాక పోవచ్చు—నిజం కావు కూడాను. రష్యా విప్లవాన్ని శాస్త్రీయ విమర్శనా దృష్టితో పరిశీలించి ఆవిప్లవం వల్ల రష్యాలో జరిగిన మహత్తర మార్పుల్ని హర్షించి, ఆ విప్లవాన్ని నడిపిన నాయకుల్ని గౌరవించాలంటే ముందు పైన చెప్పిన విషయాల్లో ఎన్ని నిజాలో ఎన్ని అబద్ధాలో తేల్చుకోవాలి. రష్యా విప్లవ స్వభావాన్ని, దాని ఫలితాల్ని అర్థం చేసుకొనబోయేముందు మనం రెండు విషయాలు తెలుసుకోవాలి. (1) సోషలిజం సర్వరోగనివారిణి కాకపోవడమే కాకుండా, సర్వమానవ ఆదర్శంకూడా కాదు. సోషలిజం కార్మికవర్గ కార్యక్రమం. కార్ల్‌మార్క్సు మాటల్లో చెప్పాలంటే బాగా అభివృద్ధిచెందిన ధనిక వాదం, అభివృద్ధిచెందే కొద్దీ సోషలిజం బీజాలను తనలోనే నాటుకొని పోషించుకొంటూ వస్తుందనీ, అనాదినుంచీ వస్తున్న ప్రైవేటు ఆస్థి అనే సంకెళ్ళని వొదిలించుకోవడమే తరువాయిగా ధనికవాదం నిర్యాణం చెంది సోషలిజానికి చోటు, ఖాళీచేస్తుందనీ,ప్రైవేటు ఆస్థి అనే

సంకెళ్ళను వొదిలించే యీ ఆఖరి పనిని కార్మికవర్గం తన కార్యక్రమంగా తీసుకొంటుందనీ, చెప్పవలసివస్తుంది. సోషలిజం కార్మికవర్గ కార్యక్రమం గనకనే, మార్క్సు ఏ దేశంలోనైనా సోషలిజం రావాలంటే ముందు ధనికవాదం బాగా అభివృద్ధి కావాలన్నారు. బాగా అభివృద్ధిచెందిన ధనికవాదం అమలులో వున్న దేశంలో రెండేవర్గాలుంటాయి అన్నారు. ఒకటి, దోపిడి చేసే ఆ కొద్దిమంది ధనికవాదులు. రెండు, దోపిడీ చేయబడే బహుళ సంఖ్యాకమైన కార్మికవర్గం. ఈ బహుళ సంఖ్యాకమైన కార్మికవర్గం సోషలిజం తన కార్యక్రమంగా తీసుకొని ధనికవాదంలోని పెత్తనం ఆ స్తిని నిర్మూలించిసోషలిజాన్ని స్థాపించుకుంటుంది. (2) కాగా మనం తెలుసుకోవలసిన రెండో విషయం పాతిక సంవత్సరాలనాడు రష్యాలో జరిగిన విప్లవం సోషలిస్టు విప్లవం కాదన్నవిషయం. మనదేశంలోని కమ్యూనిష్టులు ఎన్ని వుపన్యాసాలిచ్చినా, వుపవాసాలుచేసినా, రష్యాలో జరిగిన ఆ విప్లవం నిఖాలసయిన సోషలిష్టు విప్లవంఅని వొప్పుకోమని ఎన్ని మహాజర్లుపెట్టినా, అది సోషలిష్టు విప్లవంకాదు. అది కేవలం వ్యావసాయిక విప్లవంమాత్రమే. అది ఎందువల్ల వ్యావసాయికవిప్లవమో, అది సోషలిస్టు విప్లవం ఎందుకు కాదో, మనదేశంలోని కమ్యూనిష్టులుదాన్ని ఎట్లా సోషలిస్టు విప్లవమనుకొని భ్రమించారో పరిశీలిద్దాం.

సోషలిజం కార్మికవర్గ కార్యక్రమం అని తెలిసికొన్నాం. సోషలిజం వారి కార్యక్రమమైనప్పుడు, సోషలిస్టు విప్లవం చేసేదిగూడా ఆకార్మికవర్గమే అన్నవిషయంగూడా మనం

సులభంగా గ్రహించగలము. రష్యా విప్లవం సోషలిస్టు విప్లవం అని ఎవరైనా అంటున్నారంటే, వారు యీ పైవిషయాన్ని గ్రహించే అంటున్నారని మనం గ్రాహించుకోవాలి. రష్యా విప్లవం సోషలిస్టు విప్లవమే అని చెప్పేవారు, యీ లెక్కిలో యింకో విషయం ఒప్పుకోవలసి వస్తూంది— రష్యాలో 1917 నాటికే బలవత్తరమైన కార్మికవర్గం వుందనీ, అది చైతన్య యుతంగా సోషలిస్టు విప్లవం చేసిందనీ.

1917 నాటికి రష్యాలో బలవత్తరమైన, చైతన్యయుతమైన కార్మికవర్గం వుంది అని వాదించడం చరిత్రను కేవలం మభ్య పెట్టడ మవుతుంది. చరిత్రకు మసిబూసి మారేడుకాయ చేయడం నిరుపయోగం. చరిత్రను ఒక శాస్త్రంగా చదువుకొని, విమర్శించుకొని, అది యిచ్చే జ్ఞానాన్ని పురస్కరించుకొని, దాన్ని ముందుకు నెట్టడానికి ప్రయత్నం చెయ్యగలమేగాని, చరిత్రను కేవలం సృష్టించలేము. 1917 నాటి రష్యాస్థితి ఎట్లా వుందో పరిశీలిద్దాం.విప్లవానికి పూర్వపు రష్యా జారు ప్రభుత్వం కింద నలిగి అన్ని విషయాల్లోగూడా ఐరోపాఖండంలోని మిగతా దేశాలకంటె ఎన్నో మైళ్లు వెనక నడుస్తుండేది.రష్యా ప్రజల్లో నూటికి 86 గురు గ్రామాల్లో నివసిస్తుండేవారు. ఈ గ్రామాల్లో నివసించే జనసంఖ్యలో 2/3 వంతు ప్రజలు ఒక్కొక్కరికి పదేసి ఎకరాల భూమికి తక్కువగలవారే. ఆ భూమినిగూడా పూర్వకాలపువారి పితామహులు దున్నుకొనే పురాతన సాధనాలతోనే దున్నుకొనేవారు. గ్రామాల్లో నివ

సించే యీ రైతాంగమంతా పోట్టకోసినా అక్షరంముక్క దొరక నియ్యనివారే.

పారిశ్రామిక కూలీలు జనసంఖ్యలో చాలా తక్కువ. 30 లక్షలు మాత్రమే ఫ్యాక్టరీల్లోనూ, గనుల్లోనూ పనిచేస్తుండే వారు. ధన మదాంధులైన భూస్వాములకింద పేద రైతులు, వ్యవసాయకూలీలు ఏవిధంగా నలిగిపోయేవారో యీ కార్మికులుగూడా సెమి-ఫ్యూడల్ విధానమైన జారుప్రభుత్వంకింద తింటానికి చాలని వేతనాలతో, అందరూ కలిసి ఒక సంస్థగా చేరి కష్టసుఖాలు చర్చించుకొనే హక్కుగూడా లేకుండానలిగి మూలుగుతుండేవారు.

పారిశ్రామిక ధనికవాదం అప్పుడు రష్యాలో చొచ్చుకున్నంతవరకైనా అతి నవీనపద్ధతుల్లోనే చొచ్చుకుంది. బ్రిటన్, అమెరికా దేశాల్లో మాదిరిగా పారిశ్రామిక ధనికవాదం ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ, ఒక్కొక్క మెట్టు కట్టుకుంటూ మాత్రం రష్యాలో జరగలేదు. విప్లవానికి పూర్వమే రష్యాలో కొద్దిభాగంలో అయినప్పటికిన్నీ పారిశ్రామిక ధనికవాదంఒక్కసారిగా అన్ని నవీనపద్ధతుల్లోనూ స్థాపించబడింది. రష్యాలోని ఆకొద్ది భాగంలోని పద్ధతినే రష్యావిప్లవం, రష్యా అంతటా నెలకొల్ప గలిగింది. దీన్నిబట్టి విప్లవానికి పూర్వం సైతం రష్యాదేశం, అన్ని దేశాలమాదిరిగా కాకుండా ఒక విపరీత పద్ధతిలోనే అభివృద్ధి చెందుతూ వచ్చిందని తేలుతూ వుంది.

రష్యాలోని ఆకొద్ది కార్మికవర్గం మిగతా గ్రామాల్లోని ప్రజలకంటే మానసికాభివృద్ధి కలిగివుండేవారు. దీనికి కారణం

నవీన పారిశ్రామిక విధానం వుద్దేశరహితంగానే, ఆవిధానంకింద పనిచేసేవారికి కలిగించే మానసిక చైతన్యమే. రైతాంగంతో పోల్చిచూస్తే వీరు మానసికంగా, వైజ్ఞానికంగా, సాంఘికంగా ఎంతో ముందువుండేవారు. ఈ ఒక్క కారణంచేతనే రష్యాలోని సోషలిస్టులు, రష్యా కేవలం వ్యావసాయిక దేశమైనప్పటికీ అక్కడ జరుగనున్న విప్లవంలో కార్మికులు ప్రథమ శ్రేణిలో నిలబడాలి అన్న, మార్క్సిస్టు, సిద్ధాంతాన్ని పుచ్చుకున్నారు. ఈ విషయాన్ని ప్రతివారూ బాగా గుర్తుంచుకోవాలి. రష్యాలో జరిగిన విప్లవంలో సోషలిస్టునాయకులు ప్రధానపాత్ర వహించడం వల్లనే చాలామంది రష్యాలో జరిగిన విప్లవం సోషలిస్టు విప్లవం అని భ్రమిశారు. అది కేవలం వ్యావసాయిక విప్లవమే! విప్లవ ఫలితాలు కలగలుపుగా వుండడానికి కారణం ఆవిప్లవాన్ని నడిపింది చైతన్యయుతమైన సోషలిస్టు నాయకులు గనక.

రష్యాలోని అప్పటి కార్మికులు రైతులకంటే ముందు నడిచేవారన్నంత మాత్రంచేతనే ఎవరూ భ్రమించ నక్కర లేదు. అక్కడ కార్మికుల్లోనూ, రైతుల్లోనూగూడా చాలా మందికి వ్రాయను చదువనుగూడా చేతగాదు. యంత్రాలు నడపటంవల్ల కలిగే ఆ మానసిక చైతన్యం మాత్రం కార్మికులలో వుండేది. రష్యావిప్లవకారులు వారి వ్రాతలలో యీ విషయాన్నే ఎంతో బాధగా చెప్పుకున్నారు. అప్పుడు రహస్యంగా పనిచేసేవారి సోషలిస్టుపార్టీలోనే చదువురాని సభ్యులు చాలామంది వుండేవారని వారంతా ఆ పార్టీలోవుండే చదువు

కున్న ఒక యువక విప్లవకారునిచేత వారి సాహిత్యపత్రికలు, రహస్యకరపత్రాలు చదివించుకొని అర్థంచెప్పించుకొని, ఆ ప్రకారం పనిచేసేవారని తెలుస్తూంది.

ధనికవాదం కొద్ది ప్రదేశాలలోనే ప్రవేశించటంచేతా, కొద్దిగానే అమలులో వుంటంచేతా, అక్కడి ధనికవాదులు చాలా యిబ్బందులపాలయ్యేవారు. సాంఘికంగా కార్మికుడు అభివృద్ధి చెందిన లెక్కప్రకారం ధనికవాది అభివృద్ధి చెందలేకపోయాడు. ఆర్థికంగా అతడు విదేశీ పెట్టుబడిమీద ఆధారపడి వుండేవాడు. రాజకీయంగా జారుప్రభుత్వంపై ఆధారపడి వుండేవాడు. ధనికవాద విధానం బాగా అమలుజరగాలన్నా, అభివృద్ధికావాలన్నా, జారు ప్రభుత్వవిధానం ఆటంకం అని గ్రహించికూడా రష్యాలోని ధనికవాదులు జారు ప్రభుత్వంపై విప్లవాన్ని చేస్తానికి తయారు కాలేదు. వారికి తెలుసు. జారు ప్రభుత్వంపై తీసుకొచ్చిన విప్లవం అంతటితో ఆగక వారినికూడా తుడిచి పెడుతుం దన్న విషయం. కాగా తేలిన విషయం యిది. (1) జారు ప్రభుత్వం తన నిర్బంధ విధానం కింద రైతుల్ని, కార్మికుల్ని అణగద్రొక్కి వుంచేదనీ, వారికిసంస్థగా ఏర్పడే హక్కుకూడా లేకుండా, విద్యనేర్చుకొనే అవకాశాలు లేకుండా వుంచబడ్డారనీ, దీనిఫలితంగా అక్కడ ప్రజాస్వామిక సూత్రాలను అమలుజరపడానికి గాని, అభ్యసించడానికిగానివీలు కాదని. (2) అక్కడబూర్జువా మధ్యతరగతి సంఖ్యలో తక్కువ అవడమేకాకుండా సాంఘికంగా, రాజకీయంగా వెనకబడి వుంటం చాత జారు ప్రభుత్వంపై విప్లవం నడిపి కేపిటలిస్టు

ప్రజాస్వామికాన్ని స్థాపించే అవకాశం వారికి చిక్కలేదు. (3) జారు ప్రభుత్వం క్రింద రష్యా నలిగి రాజకీయంగా ప్రజాస్వామిక విప్లవానికీ,ఆర్థికంగా వ్యాపసాయిక విప్లవానికీ తయారై వేచివుంది. (4) ప్రజల్లో అజ్ఞానం ప్రబలి వుంటంచాతా, ముఖ్యంగా రైతువర్గం వెనకబడి వుంటంచాతా, విప్లవ నాయకత్వం కార్మికవర్గం చేతుల్లో పడవలసివచ్చింది. ఆ పరిస్థితుల్లో జరిగిన విప్లవాన్ని అందుకనే చాలామంది సోషలిస్టు విప్లవం అనుకున్నారు.

మరి అయితే ఆవిప్లవస్వభావం ఎట్టిది? అది వ్యాపసాయిక విప్లవమయితే దాని ఫలితాలు ఆవిధంగా ఎందుకు వున్నయ్? దానికి గల కారణం ఏమిటి? అవిప్లవంలో బోల్షివిక్ పార్టీ ప్రాధాన్యత ఏమిటి? విప్లవానంతరం దాని పాత్ర ఏమిటి? ఇవీ మనం ఆలోచించవలసిన విషయాలు.

# II

రష్యాలో జరిగిన ఆ విప్లవం సోషలిస్టు విప్లవం కాదు అన్నాం. దానికి ఒక కారణంగూడా యిదివరకే చెప్పుకున్నాం. ధనికవాదం అభివృద్ధిచెందిన దేశాలలోనే సోషలిస్టు విప్లవానికి వాతావరణం, తయారవుతుందని మార్క్సు చెప్పాడు గనక, రష్యాలో అల్లాంటి వాతావరణం ఏమీలేదు గనక అక్కడ వచ్చిన విప్లవం సోషలిస్టు విప్లవం కాదు అన్నాం. ఈ ఒక్క కారణం చాతనే కాదు, ఆ విప్లవాన్ని సోషలిస్టువిప్లవం

అనకపోవడం. అసలు యిది ఒక కారణమే కాకపో వచ్చుగూడా. దానికి యింకా అనేక కారణాలున్నాయి. ఆ విప్లవాన్ని నడిపిన బోల్షివిక్ పార్టీ యిచ్చిన ప్రణాళికగాని, నినాదాలుగాని పరిశీలిస్తే చాలు. 1917 వరకు బోల్షివిక్ పార్టీ నాయకులు—వీరంతా మార్క్సిస్టులే— ఎన్నడూ, ఏ నిమిషానగూడా సోషలిస్టు కార్యక్రమాన్ని గురించి చర్చించుకొని ఎరుగరు. వారి పార్టీ సభలలో గాని, చర్చలలో గాని ఎన్నడూ సోషలిజాన్ని గురించి వాదించుకొనేవారే కాదు. అప్పటి రష్యా పరిస్థితులలో జరగవలసింది సోషలిస్టు విప్లవం కాదు అన్న విషయాన్ని చైతన్యయుతంగా గాని, యాదృచ్ఛికంగాగాని మొదటిగా గ్రహించింది మాత్రం బోల్షివిక్ పార్టీ నాయకులే. వారు ఎంత సోషలిస్టునాయకులైనా అప్పట్లో ఐరోపాఖండంలో వున్న ప్రజాస్వామిక సంస్థల్ని ఎప్పుడూ ఖండించేవారు కాదు. వారు నిజమైన మార్క్సిస్టులు గనకనే అట్లా చేసేవారు కాదు. కాని ఏసంస్థలోనైనా విప్లవ నిరోధకభావాలుగాని, శక్తులుగాని వుంటే వాటిని నిర్దాక్షిణ్యంగా ఖండించేవారు. కాబట్టి అప్పటి బోల్షివిక్ పార్టీనాయకులు నిజమైనమార్క్సిస్టులుగాని,వూహావాదులుకారని తెలుస్తూంది.రష్యాపరిస్థితుల్ని సరిగ్గాఅర్థంచేసుకున్నారు గనకనే సోషలిస్టువిప్లవం సంగతి అప్పట్లోవారు ఎత్తేవారేకాదు.జారుప్రభుత్వ విధానంకింద రష్యా ప్రజాబాహుళ్యం అంతా నలిగి, పారుదల లేని చెరువునీరులాగా, అభివృద్ధిచెందకుండా బాధపడుతున్న ఆ పరిస్థితుల్లో జారు ప్రభుత్వాన్ని కూలద్రోయ్యడమే నిజమైన

విప్లవకారుడు చెయ్యదగినపని అని వారు గ్రహించారు. ఆపని జరగాలంటే పీడిత ప్రజాసామాన్యంవల్ల జరగవలసిందేగాని, రష్యాలోవున్న అకొద్దిపాటి పారిశ్రామిక కూలీలవల్లగాని, సోషలిస్టు నాయకులవల్లగాని జరిగేపని కాదని వారికి తెలుసు. దీనికి నిదర్శనం ఆవిప్లవంలో వారిచ్చిన నినాదాలే చాలు. "తిండి, భూమి, శాంతి" అన్న నినాదాలక్రింద జరిపిన విప్లవం సోషలిస్టు విప్లవం ఏవిధంగా అవుతుంది? ధనమదాంధులైన భూస్వాములకు, మిలిటరీ శక్తిని ఆధారంచేసుకొని రాజ్యం ఏలుతున్న వారికి తప్ప మిగతా అన్నివర్గాలకు వర్తించే యీ "తిండి, భూమి, శాంతి" అన్న నినాదాలకింద చేసిన విప్లవం సోషలిస్టు విప్లవం ఏవిధంగా అవుతుంది. "రైతుకి భూమి కావాలి" అన్న నినాదం సోషలిస్టు విప్లవంయొక్క కార్యక్రమం కాదు, వ్యావసాయిక విప్లవనినాదం; కాని ఫ్రెంచి విప్లవంగూడా యిదే నినాదంకింద నడిచింది. అయితే రష్యా విప్లవంలో కార్మికవర్గం ప్రథమశ్రేణిలో నిలబడింది. అంత మాత్రం చాతనే ఆవిప్లవంయొక్క సాంఘికస్వభావం మారిందనుకోవడం పొరపాటు. అవి రెండూ ప్రజాస్వామిక విప్లవాలే. కాని ఫలితాలు భిన్నంగా వున్నయి.

ఫ్రెంచి విప్లవాన్ని నడిపింది అధికార వ్యామోహితులైన రాజకీయవేత్తలు, మిలిటరీనాయకులు. నెపోలియన్ నాయకత్వం క్రిందనడిచిన ఆఫ్రెంచి విప్లవం "స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం, సమానత్వం" అన్న నినాదాలుయిచ్చి, చారిత్రాత్మికంగా అవసరమైన బూర్జువా ప్రజాస్వామిక విప్లవాన్ని ఐరోపాఖండ

మంతటా నడిపి, జమీందారీ విధానాన్ని కూలద్రోసింది. నెపోలియన్ దండయాత్ర ఫలితంగా కలిగిన యీ మార్పులు మాత్రం నెపోలియన్ యెన్నడూ చైతన్యయుతంగా కోరుకో లేదు. ఐరోపా ఖండాన్నంతా ఫ్రాన్సుదేశం కిందకు తెచ్చి, ఫ్రాన్సుదేశాన్ని తనకిందకు తెచ్చుకోవాలనే అతని స్వార్థమే అతనిచాత, ఐరోపాఖండంలోని జమీందారీ విధానాన్ని కూల ద్రోసి, బూర్జువా సాంఘిక విప్లవాలను రేకెత్తించే ఆ విప్లవ కార్యాన్ని చేయించింది.

రష్యా విప్లవంలో మాత్రం అట్లా జరగలేదు. ఇరవయ్యో శతాబ్దపు ప్రారంభంనాటికి మధ్య ఐరోపా ఖండంలో ముమ్మరంగా సాగుతున్న సోషల్ డెమొక్రాటిక్ ఉద్యమంయొక్క శాఖగా రష్యాలో కూడా సోషల్ డెమొక్రాటిక్ పార్టీ వుండేది. మెన్షివిక్ పార్టీ, బోల్షివిక్ పార్టీ రెండూ కూడా రష్యాలోని ఆ సోషల్ డెమొక్రాటిక్ పార్టీయొక్క అంతశ్శాఖలే. ఈ రెండు శాఖలు మొదట్లో, పార్టీలో సభ్యుల్ని చేర్చుకొనే సమస్యపై విభేదాలు కలిగి ఏర్పడినప్పటికీ, రానురాను వీటి రెంటికీ కార్యక్రమంలోనూ సిద్ధాంతాల్లోనూ కూడా తీవ్రమైన విభేదాలు ఏర్పడ్డయి. ఈ విభేదాలు ఏవిధంగా పరిణమించినవో ముందు ముందు పరిశీలిద్దాం.

ప్రస్తుతం మనం చర్చించవలసిన విషయం రష్యా విప్లవాన్ని నడిపిన బోల్షివిక్ పార్టీ నాయకత్వం ఫ్రెంచి విప్లవ నాయకత్వంతో ఏవిధంగా భేదించిందో అన్నది. ఫ్రెంచివిప్లవాన్ని నడిపిన నాయకులకు, తాము ఐరోపాఖండంలో జమీందారీ

విధానాన్ని కూలద్రోసి, బూర్జువావిప్లవాన్ని నడిపి మానవ చరిత్రలో నూతనాధ్యాయాన్ని ప్రారంభిస్తున్నామన్న చైతన్యం లేనే లేదు. పైగా అట్లాంటి మార్పువారు ఎన్నడూ వాంఛించ లేదు. బోల్షివిక్ పార్టీ తాను తలపెట్టిన కార్యమేమిటో చైత న్యయుతంగా తెలుసుకుంది, కోరుకుందికూడాను. జారుప్రభు త్వంకింద నలిగిపోయిన ప్రజాసామాన్యానికి విముక్తికలిగించా లంటే, ఏ కార్యక్రమం యిస్తే వారు విప్లవానికి ఆయత్తమవు తారో అన్న విషయాన్ని ఒక్క బోల్షివిక్ పార్టీ నాయకులే బాగా గ్రహించగలిగింది. జారు ప్రభుత్వపు కఠినమైన రహస్య పోలీసుశాఖనుంచి తప్పించుకొని విప్లవాన్ని నడపా లంటే ఎంతకష్టమైన పనో వారికి బాగా తెలుసు. తీరా విప్ల వాన్ని నడిపినా, ప్రభుత్వాధికారాన్ని బోల్షివిక్ పార్టీ చేపట్టి తమ ఆదర్శాన్ని నెరవేర్చుకోవాలంటే ఎంత దుస్సాధ్యమైన కార్యమోగూడా తెలుసు. అందుకనే వారు మొదటినుంచీ పార్టీని నిర్మించుకోవడమే జాగ్రత్తగా నిర్మించుకొచ్చారు. ఆ పార్టీలో వున్నంత క్రమశిక్షణ అప్పట్లో ఏ పార్టీలోనూ కనుపించేదికాదు. సభ్యుల్ని చేర్చుకొనేటప్పుడు బహుజాగ్ర త్తగా ఆలోచించి చేర్చుకొనేవారు. ఊరికే చందాలిస్తూ వుండేవారిని చేర్చుకొనేవారేకాదు. పార్టీలో చేరిన ప్రతిసభ్యుడు విప్లవమే జీవితాదర్శముగా పెట్టుకొనేవాడు, ప్రజాసామాన్యంతో నిత్యం కలిసి పనిచేసేవాడై వుండాలి. నెలజీతాలు పుచ్చు కొంటూ, విప్లవమే జీవితాదర్శంగా పెట్టుకొనే వారే విప్లవ సంస్థలో సభ్యులుగా వుండాలని లెనిన్ అభిప్రాయం కూడాను.

ఇంత క్రమశిక్షణతో తయారుచేసిన సంస్థ కాబట్టే బోల్షివిక్ పార్టీ దుస్సాధ్యమైన కార్యాన్ని సాధించగలిగింది. వాగ్వివాదాలతోనూ, వ్యర్థమైన విషయాలపై చర్చలుజరపడంతోనూ, ఎన్నడూ కాలాన్ని వ్యర్థపుచ్చేవారేకాదు. అందుకనే అప్పట్లో వారు రష్యాలో సోషలిస్టు విప్లవం చేయాలని ఎన్నడూ చర్చించుకోనేవారుకాదు.

సోషలిస్టువిప్లవం తీసుకురావలసిందే అన్నపట్టుదలతో పరిస్థితులిచ్చే అవకాశాల్ని జారవిడుచుకొనే మూర్ఖులుగాని, ప్రూహావాదులు గాని కారు. ఆ పరిస్థితులలో పీడిత ప్రజా సామాన్యాన్ని కూడగట్టుకొనివచ్చే కార్యక్రమాన్ని యిస్తేనే గాని విప్లవం నెరవేరదనీ, ఆ విప్లవనాయకత్వం తమకు దక్కదనీ వారికి తెలుసు. అందుకనే "తిండి, భూమి, శాంతి" అన్న కార్యక్రమాన్ని అప్పట్లో వారిచ్చింది. పట్టణ వాసాలలో పని చేసే శ్రామికులకు "తిండి" అన్న నినాదం బాగానచ్చింది. "భూమి, శాంతి" అన్న నినాదాలు రైతాంగానికిబాగా అవసరంగా కనపడ్డాయి. అంతేగాకుండా యుద్ధంలోకిపోయి త్వరలోనే విజయాన్ని చేకూర్చుకొని యింటికి వచ్చి భార్యాబిడ్డలతో సుఖంగా సంసారాలు గడుపుకోవచ్చునని గంపెడాసతో యుద్ధానికి పోయిన సైనికులు రాను రాను ఆ అవకాశాలు లేవని గ్రహించారు. పైగా ఆయుద్ధం వారుచేస్తుంది జారుప్రభుత్వాన్ని నిలబెట్టడానికేగాని, తమకు భూముల్ని సంపాయించుకొని, ఎక్కువ సుఖాల్ని పొందడానికి కాదని తెలుసుకున్నమీదట, ఎప్పుడు యుద్ధంమాని, యింటి ముఖంపట్టి తమ భార్యాబిడ్డల్ని

చూద్దామూ అన్న లెఖ్ఖలో సైనికు లున్నారు. అట్లాంటి సైనికులకు బోల్షివిక్ పార్టీ యిచ్చిన "భూమి, శాంతి" నినాదాలలో ఆశాజ్యోతులు కనుపించాయి. ఈవిప్లవంలో పాల్గొంటే వారికి భూమి, శాంతి దక్కేటట్లు కనిపించింది. అందుకనే వారు తుపాకీలను మడిచి, చంకన బెట్టుకొని తిరోముఖులై వచ్చి విప్లవంలో పాల్గొనడానికి సంసిద్ధులైనారు. ఈవిధంగా వీరందరినీ కూడగట్టుకొని నడిపిన విప్లవం సోషలిస్టు విప్లవం ఏవిధంగా అవుతుంది? కాదన్న సంగతి బోల్షివిక్ పార్టీ నాయకులకు గూడా తెలుసు. కాని రెండు విషయాలలో మాత్రం వారు జాగ్రత్త వహించారు.

(1) ఆర్థికంగా నలిగి నకనక లాడుచున్న రష్యా ప్రజా సామాన్యాన్ని రాజకీయ విప్లవానికి తయారుచేసి, కార్మిక వర్గాన్ని ప్రథమశ్రేణిలో వుంచగలిగారు.

(2) ఆ విప్లవోద్యమాన్ని మార్క్సిస్టు విప్లవవాదులైన తమ నాయకత్వం కింద వుంచుకో గలిగారు.

రష్యా విప్లవం, ఫ్రెంచి విప్లవం రెండూ ప్రజాస్వామిక విప్లవాలైనప్పటికీ యీపై కారణాల వల్లనే వాటి ఫలితాలు విభిన్నంగా వున్నాయి.

# III

రష్యా విప్లవం సోషలిస్టు విప్లవమే అని వాదించేవారు వారి వాదానికి బలాన్ని చేకూర్చుకోవడానికై యిట్లా చెబు

తుంటారు. "రష్యాలో జరిగిన ఫిబ్రవరి విప్లవం బూర్జువా విప్లవం అయినమాట వాస్తవమే. కాని అక్టోబరు విప్లవం మాత్రం కల్తీలేని ప్రొలిటేరియన్ విప్లవం. ఈ రెండు విప్లవాల్ని విభజించి చూడలేనివారు మాత్రం రష్యావిప్లవం మొత్తంగా బూర్జువా ప్రజాస్వామిక విప్లవమే అంటారు."

నిజమే. ఫిబ్రవరి విప్లవాన్ని, అక్టోబరు విప్లవాన్ని విడదీసి చూడలేనివారు లేకపోలేదు, ఉన్నారు. కాని అల్లాంటివారు నిజమైన విమర్శకులుగా ఎన్నడూ పరిగణింపబడలేదు. పరిగణింపబడరు కూడాను. కాని ఆ రెండు విప్లవాల్ని విభజించి చూడలేని రష్యా విప్లవ విమర్శకులకు ఏవిధంగా శాస్త్రీయ విమర్శనాదృష్టి లేదనుకుంటున్నామో, ఆ రెండు విప్లవాల్ని విడదీసి చూడగలిగినప్పటికీ, వాటి రెంటికీ వున్న చారిత్రాత్మిక విలువల్ని మాత్రం ఎక్కువగా వూహించి చెప్పే వీరుగూడా పై రకపు విమర్శకులతో సమానమే అనుకోవలసి వస్తూంది.

అందరూ 'ఫిబ్రవరి విప్లవం, ఫిబ్రవరి విప్లవం" అని చెప్పుకొనే ఆ 1917 మార్చిలో జరిగిన విప్లవం శాస్త్రోక్తంగా, ఫక్తయిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవమే. "తిండి, భూమి, శాంతి" అన్న నినాదాల కింద, పట్టణాల్లోవుండే శ్రామికుల్ని, గ్రామాల్లో నివసించే రైతుల్నే గాకుండా, యుద్ధరంగంలో వోయిన సైనికుల్ని గూడా కూడగట్టుకు రాగలిగారు, రష్యా విప్లవనాయకులు. సైనికుల్లో చాలాభాగం రైతుకుటుంబాల్లోనించి వెళ్ళినవారే. వారు యుద్ధరంగానికి వెళ్ళినా, భూమిని సంపాయించుకొనివచ్చి సుఖంగా బ్రతుకవచ్చును అన్న ఆశ

తోనే ముఖ్యంగా వెళ్ళారు. ఆ ఆశలు ఎప్పుడు అడుగంటి నయ్యో అప్పటినించీ వారు తిరోముఖులవడానికి లోలోపల వుబలాట పడుతున్నారేగాని యుద్ధంలో గెలవాలనే కోర్కె లేదు. మిలిటరీ నాయకుల క్రమశిక్షణకు భయపడి యుద్ధ రంగంలో వున్నారుగాని యుద్ధం చెయ్యాలనే వాంఛతో మాత్రం కాదు. కాని సమయం కొరకు మాత్రం చూస్తు న్నారు తిరుగుము ఖాలు పట్టడానికి.

యుద్ధరంగంలోని సైనికుల మనస్తత్వాలు అట్లా వుండగా యిక్కడ దేశంలో విప్లవం రానేవచ్చింది. రైతుల్ని, శ్రామి కుల్ని అందర్నీ కూడగట్టకొని రష్యా విప్లవకారులు ఫిబ్రవరి విప్లవాన్ని జయప్రదంగా నడప గలిగారు. జారు పదభ్రష్టు డయ్యాడు. వెంటనే ప్రొవిజనల్ గవర్నమెంటు స్థాపించబడింది. ఈ ప్రభుత్వాన్ని నెలకొల్పింది మెన్షివిక్ పార్టీ (సోషల్ డెమొ క్రాటిక్ పార్టీలో యిది ఒక ముఠా) నాయకుడైన కెరెన్‌స్కీ. "జమీందారీ విధానం రద్దయింది. భూస్వాములనేవారే నామ రూపాల్లేకుండా పోతారు. ఇక మనం దున్నుకొనే భూమి మన హక్కే అవుతుంది" అని వుబలాటపడ్డారు రైతులు. వారు ఆ ఆశతోనే ఆ విప్లవాన్ని విజయవంతంగా నడిపారు. వారే లేకపోతే అప్పట్లో రష్యాలో విప్లవం నెగ్గటమే అసంభవం.

ఆ విధంగా విప్లవంలో నెగ్గి, తాత్కాలిక ప్రభుత్వాన్ని స్థాపించగలిగిన కెరెన్‌స్కీ, నిజంగా, అంతకుముందు తానిచ్చిన కార్యక్రమాన్ని అమలు జరపగలిగినట్టయితే, రష్యాలో ఆ తరువాత కలిగిన కొన్నిమార్పులు కలిగేవే కావేమో. 'రైతుకి

భూమికావాలి'అని విప్లవంలో యిచ్చిన నినాదాన్ని కెరెన్‌స్కీ ప్రభుత్వం అమలు జరపలేక పోయింది. విప్లవ నిరోధకులైన కొన్ని పై వర్గాల మాటలకు లొంగి కెరెన్‌స్కీ రైతులకుభూమిని యిచ్చే కార్యక్రమాన్ని మానివేశాడు. అతని దృష్టి అంతా రష్యాను, జర్మనీ సామ్రాజ్యవాదులు కబళించకుండా చూడాలి అనేపోయింది. అది జరగాలంటే తనకు అన్ని వర్గాల— ముఖ్యంగా పై వర్గాల—సహకారము కావాలని అభిప్రాయ పడ్డాడు. అతను అందుకనే రైతులకు భూమిని యిచ్చే కార్యక్రమాన్ని మాని యుద్ధాన్ని విరమించకుండా సాగించడానికి ఆయత్తమయ్యాడు. ఈపని రైతులకు ఎంతో నిరుత్సాహాన్ని కలిగించింది. తాము ఎందుకు విప్లవం చేశామా, ఎవరి కొరకు చేశామా అని వెనక్కు తిరిగి చూసుకున్నారు. ఎన్నో కష్టాలు పడి అగచాట్లకు లోనై ప్రాణత్యాగానికి సిద్ధపడి, ఎంతో రక్తాన్ని విప్లవానికి ఆహుతి చేసింది యిందుకా అని వారి మనస్సుల్లో అంతర్విప్లవం చెలరేగింది.

అటు క్రమశిక్షణకు భయపడి యుద్ధం చేస్తున్న సైనికులు తమకు మంచి అవకాశం లభించింది అనుకుంటున్న సమయంలో కెరెన్‌స్కీ ప్రభుత్వం, వారిని తిరిగి యుద్ధరంగాభిముఖులై పొమ్మని ఆజ్ఞాపించింది. ఈ ఆజ్ఞ వారిని ఏవిధంగానూ కదల్చ లేక పోయింది. జారుఅంటేనే ప్రభుత్వం, ప్రభుత్వం అంటేనే జారు, అనే లెక్కలో వారికి యిదివరకు నూరిపొయ్యబడింది. అట్లాంటి భావాల్లోవున్నవారు జారు పదభ్రష్టుడయ్యాడనగానే ప్రభుత్వమే కూలిపోయినట్టు అని అర్థం కలిపించుకున్నారు.

ప్రభుత్వమే కూలిపోయినట్లు అని వూహించుకున్న తరువాత వారికి యిక ఒక్క నిమిషంగూడా యుద్ధం చెయ్యడం అర్థం లేని పనిగా తోచింది. అందువల్ల తుపాకీలు అవతలపారేసి యింటికిపోదాం అనుకొంటూవున్నారు వారు. ఆ పరిస్థితులో "రైతుకి భూమికావాలి" "అన్నిహక్కులు సోవియట్లకే" అన్న నినాదాలక్రింద అక్టోబరు విప్లవానికి ఆయత్తమవుతున్న బోల్షివిక్ పార్టీ రైతులకేకాకుండా, సైనికులకుకూడా ఆశా జ్యోతిగా కనుపించింది.

అక్టోబరు విప్లవానికి ఆయత్తమవుతున్న లెనిన్‌కుగాని, యితర బోల్షివిక్‌పార్టీ నాయకులకు గాని, జులై (1917) మాసంవరకుగూడా తాము చేయబోతున్న విప్లవం ఆస్వరూపం తీసుకొంటుందని గాని, ఆఫలితాలు కలుగుతయి అనిగాని వూహించుకొనే ఎరుగరు. పురుషప్రయత్నం కంటే అక్కడి పరిస్థితులు ఆవిధంగా కలిసి వచ్చాయి. ప్రొలిటేరియట్ నియంతృత్వం స్థాపించాలనే వారి ప్రయత్నాల ఫలితంకంటే, కెరెన్‌స్కీ చేసిన లోపాలే వారికి ఎంతో తోడ్పడ్డాయి.

'అక్టోబరు విప్లవంలో బోల్షివిక్‌లు యిచ్చిన "అన్ని హక్కులు సోవియట్లకే" అన్న నినాదమే గుర్తు- ఆ విప్లవం సోషలిస్టు విప్లవం అనడానికి,' అని కొందరి వాదన. కాని అసలు ఆనినాదమే గుర్తు, అది సోషలిస్టు విప్లవం కాదంటానికి. ఆ విప్లవం సోషలిస్టు విప్లవం కాదంటానికి ఆనినాదం ఏ విధంగా గుర్తో తేల్చుకొనే ముందు యీ సోవియట్లనుగురించి, వాటి నిర్మాణాన్ని గురించి కొంత తెలుసుకుందాం.

రష్యాలో జారు ప్రభుత్వం క్రింద పేరుకి పార్లమెంటు అనేది ఒకటి వున్నా అప్పట్లో రష్యాలో ప్రజాస్వామిక సూత్రాలనేవి ఎక్కడా అమలు జరిగేవే కావు. జారు నియంతృత్వం క్రింద అన్ని హక్కులూ నలిగివున్నాయేగాని ప్రజాస్వామిక మనేదే ఎక్కడా కనుపించేది కాదు. కాని, పురిటిలోనే సంధికొట్టి పోయిన 1905 నాటి విప్లవఫలితంగా, రష్యాలోని అన్ని గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూకూడా కార్మికులు, కర్షకులు, సైనికులు వారివారి శ్రేయస్సును గురించి చర్చించుకొనే నిమిత్తం, సోవియట్లను స్థాపించుకొన్నారు. రష్యా ప్రభుత్వ విధానంలో ఎక్కడా ప్రజాస్వామికం కనుపించక పోయినా ప్రభుత్వానికి బైటమాత్రం దేశమంతటా ప్రజాస్వామికం తలెత్తుతూ వచ్చింది. దానికి కారణం యీసోవియట్లే రష్యాలో వున్న జనసంఖ్యలో 86°/₀ రైతులు గనక దేశంలో ఎక్కువగా రైతుల సోవియట్లే వుండేవి. కార్మికుల, సైనికుల, సోవియట్లు సంఖ్యలో చాలా తక్కువగా వుండేవి. అదీగాక సైనికుల్లో చాలాభాగం రైతుకుటుంబాల్లోనించి వచ్చిన వారే. అందుచాత పట్టణాల్లోవుండే సోవియట్లు కార్మికులవే అయినప్పటికి మొత్తంమీద రైతుల సోవియట్లే దేశమంతటా విరివిగా వున్నయి. 1917 ఫిబ్రవరి విప్లవానంతరం యీ సోవియట్లపలుకుబడి బాగా ఎక్కువయింది. ఫిబ్రవరి విప్లవ సమయంలో సైతం వందల లెఖ్ఖలోనేవున్న బోల్షివిక్ పార్టీ ప్రభుత్వాన్ని చేపట్టాలంటే యీ సోవియట్లసహాయం బాగా అవసరమని గ్రహించింది. అందుకనే "అన్నిహక్కులు సోవి

యట్లకే" అన్న నినాదంయిస్తేగాని తాము తిరిగి విప్లవాన్ని నడిపి అధికారాన్ని తమచేతుల్లోకి లాక్కోలేమని గ్రహించారు. ఈ సోవియట్లు అన్నీ రైతులవే అయినప్పుడు వారికి కావలసిన "రైతుకి భూమికావాలి" అన్న నినాదం యివ్వాలి అని ఆలోచించారు. కెరెన్‌స్కీప్రభుత్వం రైతుకి భూమినియిచ్చే కార్యక్రమాన్ని అడుగునపెట్టిన ఆసమయంలో "రైతుకి భూమి కావాలి" "అన్నిహక్కులు సోవియట్లకే" అన్న నినాదాలు యిచ్చిన బోల్షివిక్‌పార్టీతో రైతులు చేతులుకలిపి కెరెన్‌స్కీ ప్రభుత్వంపై విప్లవానికి సిద్ధమయ్యారు. యుద్ధవిముఖులైన సైనికులుగూడా యిందుకు తోడ్పడి సాయుధవిప్లవం చేస్తానికి సిద్ధమయ్యారు.

అప్పట్లో అన్ని సోవియట్లలోకీ మాస్కో, పెట్రోగ్రాడ్ సోవియట్లు రెండూచాలా బలంగలవి. రష్యాప్రధాననగరాలలో వున్న యీ రెండు సోవియట్లు కార్మికులవే. వీటి రెంటి నాయకత్వమూ బోల్షివిక్ పార్టీదే. మొట్టమొదట యీ రెండు సోవియట్లే ఆ రెండునగరాలలోనూ విప్లవంచేసి అధికారాన్ని సంపాయించినయి. ఇదే అదనని గ్రహించి బోల్షివిక్‌పార్టీ నాయకులు "అన్నిహక్కులు సోవియట్లకే" "రైతుకి భూమికావాలి" అన్న నినాదాలు యిచ్చి దేశమంతటా విప్లవాన్ని రేకెత్తించారు. భూమికావాలి అన్న ఆశతోవున్న రైతులకు రాజకీయ అధికారం ఎవరిచేతుల్లోకి వెళుతుందా అన్న సందేహంతోనే నిమిత్తం లేకపోయింది. వారికి కావలసినభూమిని వీరు యిప్పిస్తామన్నారు గనుక వారు తిరిగి విప్లవానికి ఆయత్త

మయ్యారు. రైతులకు భూమిని యిచ్చి వారిని ఆ విధంగా కూడగట్టుకొనివచ్చి రాజకీయ అధికారాన్నంతా మాస్కో, పెట్రోగ్రాడ్ సోవియట్ల చేతుల్లోనే వుంచుకో వచ్చునుగదా అని బోల్షివిక్కులు ఆలోచించారు. ఆ రెండు సోవియట్లు కార్మికులవే గనక వాటి నాయకత్వంకింద వచ్చిన ఆ అక్టోబరు విప్లవం సోషలిస్టు విప్లవం అని మనదేశంలోని కమ్యూనిస్టులు చెబుతారు. కాని "రైతుకి భూమికావాలి" అన్న నినాదంకింద నడిచిన విప్లవం శాస్త్రీ క్తంగా సోషలిష్టు విప్లవం ఏవిధంగాఅవుతుందీ, అనిఆలోచించరు. అంతేకాదు. విప్లవానంతరం లెనిన్ యిచ్చిన కార్యక్రమంగాని, రష్యాలో తల పెట్టిన నిర్మాణవిధానముగాని ఆవిప్లవం సోషలిష్టు విప్లవంకాదని రుజూచేస్తున్నాయి.

కాని ఆవిప్లవఫలితాలు కేవలం వ్యావసాయిక విప్లవ ఫలితాలుగా మాత్రం వుండలేదు. అందువల్లనే రష్యావిప్లవాన్ని గురించి యింకా అనేకమైన దుర్భ్రమలు, విమర్శలు వచ్చినయి.

## IV

"రైతుకి భూమి కావాలి" అన్న నినాదంకింద అక్టోబరు విప్లవాన్ని నడిపిన బోల్షివిక్ పార్టీ, దేశంలోని రైతువర్గానికి ఆ విధంగా నాయకత్వం వహించింది. రైతుల్లో వున్న విప్లవ శక్తిని యీావత్తూ జమీందారీ విధానాన్ని కూలదోస్తానికి

అక్టోబరు విప్లవంలో కేంద్రీకరించ గలిగింది. ఆ కార్యక్రమం వినా మరే కార్యక్రమం యిచ్చినా రైతుల్ని విప్లవానికి ఆయత్తం చెయ్యగలిగేవారే కాదు. "ప్రొలిటేరియట్ నియంతృత్వం కావాలి" అనిగాని, "భూమిని సమిష్టిపరం చెయ్యాలి" అనిగాని, బోల్షివిక్ పార్టీ నినాదాలు యిచ్చినట్లయితే వారు చెయ్యబోయే విప్లవానికి రైతులు ఎదురుతిరిగేవారన్న విషయం నిర్వివాదాంశమే. అది గ్రహించేవారు, సోషలిస్టు లైనప్పటికీ రైతువర్గం తరఫున ఆవిప్లవంలో నాయకత్వం వహించారు. అందుకనే వారు విప్లవాన్ని జయప్రదంగా నడిపి, దేశమంతటా విరివిగావున్న విప్లవయుతమైన సోవియట్లకు రాజకీయాధికారాన్ని స్వాధీనం చెయ్యగలిగారు.

ఆయితే ఒక్క విషయం గ్రహించాలి. పెట్రోగ్రాడ్, మాస్కో పట్టణాల్లోవున్న ప్రభుత్వాన్నే కేంద్రప్రభుత్వంగా పరిగణించే ఆచారం అనాదినుంచీ వస్తుంది. అక్టోబరు విప్లవంలో నెగ్గిన మీదట పెట్రోగ్రాడ్ మాస్కో పట్టణాల్లోవున్న సోవియట్లు అక్కడ ప్రభుత్వాధికారాన్ని చేపట్టినయి. ఆ రెండు పట్టణాల్లోని సోవియట్లుకూడా కార్మికవర్గాధిపత్యంకింద వున్నవే అవడం చాతా ఆ రెండు పట్టణాల్లోని ప్రభుత్వాన్ని కేంద్రప్రభుత్వంగా భావించే ఆచారం వుంటంచాతా, విప్లవానంతరం ఆ రెండు పట్టణాల్లోని సోవియట్ల ప్రభుత్వంగూడా నామకా కేంద్ర ప్రభుత్వంగా భావించారు రైతులు. దీనికితోడు బోల్షివిక్ పార్టీ, సోవియట్లలో, మరీ బీద రైతులకే ఓట్లహక్కు వుందనీ, కూలీలకే ఆహక్కు వుందనీ శాసించి, గ్రామాల్లోని సోవి

యట్లలోకూడా ప్రొలిటేరియట్ వర్గానికే ప్రాధాన్యత యివ్వానికి ప్రయత్నించారు. ఎంత శాసించినా, ఏమిచేసినా, గ్రామాల్లో కార్మికులు ఏవిధంగా వుంటారు? అందుచేత దేశంలోని చాలా సోవియట్లు రైతువర్గాలతోనే కూడుకొని వుండేవి. కాని బహిర్గతంగా కనపడే యీ శాసనంవల్లా, పెట్రోగ్రాడ్, మాస్కో-సోవియట్లను కేంద్రప్రభుత్వంగా భావించే ఆచారంవల్లా దేశంలో ప్రొలిటేరియట్ నియంతృత్వం వచ్చినట్లు కనపడింది. విప్లవయుతమైన రైతులు, కార్మికులు కలిసి స్థాపించుకొన్న ప్రభుత్వం ఏవిధంగా ప్రొలిటేరియట్ నియంతృత్వం అనబడుతుంది? ధనికవాదం కూలిపోయిన తరువాత సోషలిజం స్థాపింపబోయేముందు గల ఆసంధియుగంలో వస్తుంది అని మార్క్సు చెప్పిన ప్రొలిటేరియట్ నియంతృత్వం అక్కడ ఏవిధంగా వచ్చినట్లు? ఒకవేళ ఆపారిశ్రామికపట్టణాల్లో ప్రొలిటేరియట్ నియంతృత్వం వచ్చిందను కొన్నా దేశంలోని ఎక్కువభాగం వ్యావసాయికప్రదేశంగదా, అక్కడి రైతులు విప్లవంచేసి, విప్లవయుతమైన వారి సోవియట్లకు అధికారాన్ని సంపాయించుకొన్నారుగదా, మరి అట్లాంటప్పుడు దేశమంతటా ప్రొలిటేరియట్ నియంతృత్వం స్థాపించబడిందిఅనడంలో అర్థంఏముంది? ఆ ప్రభుత్వాన్ని శాస్త్రయుక్తంగా మాత్రం ప్రొలిటేరియట్ నియంతృత్వం అనడానికే వీలులేదు. అసలు ఆ ప్రభుత్వాన్ని వారు "కార్మిక, కర్షక రిపబ్లిక్" అన్నారు.

ఈపేరుతో వ్యవహరింపబడిన ప్రభుత్వంయొక్క సాంఘిక స్వభావం ఏదై వుంటుంది? అది కేవలం కార్మికవర్గప్రభుత్వం

కాదామె మరి, దాన్ని ప్రొలిటేరియన్ నియంతృత్వం అన డానికి. విప్లవయుతమైన రెండువర్గాలు—రైతులు, కార్మికులు— జమీందారీ ప్రభుత్వవిధానాన్ని కూలద్రోసి, రాజకీయాధి కారాన్ని చేపట్టి, రెండువర్గాలకు సామరస్యాన్ని కుదిర్చే ప్రభు త్వాన్ని స్థాపించుకున్నాయి. అందువల్లనే రష్యావిప్లవంయొక్క సాంఘికస్వభావం మిశ్రమంగా వుంది. ఎప్పుడుగూడా ఒక విప్ల వానంతరం వచ్చే ప్రభుత్వంయొక్క సాంఘికస్వభావం ఆ విప్ల వంలో పాల్గొనే వర్గాలనుబట్టి నిర్ణయింపబడుతుంది.

అక్టోబరు విప్లవానంతరం రష్యాలో స్థాపించబడిన ప్రభుత్వం యొక్క సాంఘికస్వభావం ఆ విప్లవంలో పాల్గొన్న కర్షక, కార్మికవర్గాలతో మిళితంగాబడింది. పారిశ్రామికపట్టణాల్లో స్థాపించబడిన ప్రభుత్వాన్ని ప్రొలిటేరియన్ నియంతృత్వం అన్నా, గ్రామాల్లోని ప్రభుత్వంమాత్రం బూర్జువా ప్రజా స్వామిక స్వభావంగలదే. అందుకనే రష్యావిప్లవం ఆ మిశ్రమ స్వభావాన్ని తీసుకుంది.

ఈ విషయాన్ని అర్థంచేసుకోలేనివారే రష్యావిప్లవాన్ని గురించి అనేకమైన అపోహాలుపడి, అనేక రకాలుగా విమ ర్శించారు.

మార్క్సు బాగా అభివృద్ధిచెందిని ధనికవాదదేశాలలో, ధనికవాదం కుళ్ళినప్పుడు అక్కడ చారిత్రాత్మక అవసరంగా సోషలిజం వస్తుందని చెప్పాడుగదా, అట్లాంటప్పుడు ధనికవాద విధానంలో యెంతో వెనకబడివున్న రష్యాలో సోషలిస్టువిప్లవం ఎట్లావచ్చింది? కనక సోషలిజం చారిత్రాత్మిక అవసరం అని

మార్క్సు చెప్పే సిద్ధాంతమంతా కేవలం తప్పుల తడిక. సోష లిజం ఒక చారిత్రాత్మిక అవసరమేకాదు. అదల్లా దురభిమా నులైన కొందరు పొగరుబోతులు బలవంతాన తెచ్చే విధా నమే. ఈ విధంగా మార్క్సిజాన్ని విమర్శింప సాగారు కొందరు బూర్జువా విమర్శకులు.

ఇక మార్క్సిజమంటే యిష్టంగలవారే కొందరు రష్యా విప్లవ స్వభావాన్ని సరిగా అర్థంచేసుకోలేని కారణంచాత మార్క్సిజాన్ని యింకోరకంగా సంస్కరించారు. మార్క్సు మనం ఎప్పుడూగూడా విప్లవాన్ని శాసించలేము అన్నాడు. కాని రష్యావిప్లవం యిది తప్పు అని రుజూచేసింది. ఏ దేశంలో నైనా సరే కార్మికవర్గం సంఖ్యలో ఎంత తక్కువగా వున్నా సరే, ఆ దేశంలోని ప్రభుత్వాధికారాన్ని గనక ఆ వర్గం చేపట్ట గలిగితే సోషలిజాన్ని స్థాపించవచ్చు. రష్యా విప్లవంలో ఇంతే జరిగింది, అని వీరి వాదన.

రష్యావిప్లవాన్ని సరియైనదృష్టితో అర్థంచేసుకున్నవారికి మాత్రం యీ పై రెండు రకాల విమర్శలు ఎంత ఆధారరహిత మైనవో తెలుస్తుంది. మార్క్సు ఎప్పుడూగూడా దేన్నీ శాసించ లేదు. శాసించడ మనేదేమార్క్సిస్టు సిద్ధాంతానికి విరుద్ధం. మార్క్సు ఎప్పుడూగూడా యీ యీ పరిస్థితులు వున్నప్పుడు యీ యీ విధంగా యిదివరకుజరిగింది, కాబట్టి యికె ముందు గూడా ఏ దేశంలోనైనా ఆయా పరిస్థితులు వున్నప్పుడు, ఆయావిధంగా జరుగుతుంది, అనిమాత్రమే చెప్పాడు. మానవ

చరిత్రను మార్క్సు ఒక శాస్త్రంగా చదువుకున్నాడు గనుక అతనికి అనాదినుంచీ వస్తున్న ఒక్క విషయం బాగా నాటింది. ప్రతిదేశంలోనూ, ప్రతికాలంలోనూగూడా, పీడితవర్గం అధికార వర్గంపై విప్లవాన్ని నడిపి తన ప్రభుత్వాన్ని స్థాపించుకొంటూ రావడం అతను బాగా గ్రహించాడు. అందుకనే అతను "వర్గ కలహామే మానవచరిత్ర" అని అనగలిగాడు. ప్రిమిటివ్ కమ్యూనిస్టు వ్యవస్థనించీ సంఘం జమీందారీ విధానానికి రావడం, జమీందారీ విధానాన్నుంచీ, ధనికవాద విధానానికి రావడం అతను గ్రహించాడు. ఆయా విప్లవాలన్నీ గూడా కింది వర్గాలు పైవర్గాలపై తెచ్చే తిరుగుబాట్లే అనిగూడా అతనికి అర్థమయింది. ఇక ధనికవాదం బాగా అభివృద్ధిలో వున్నప్పుడు ధనికవర్గము, కార్మికవర్గము రెండే వర్గాలు సంఘంలో వుంటయి అని అతను విజ్ఞుడు గనక గ్రహించ గలిగాడు. కార్మికవర్గం సంఘంలోని ఆఖరివర్గం గనక ఆవర్గం పైవర్గంపై అంతిమ పోరాటం చేస్తుం దని చెప్పాడు. ఇంతకుముందు కిందివర్గం పైవర్గంపై విప్లవంచెయ్యడం సహజంగా కనబడుతుంది. కనక ఇదికూడా సహజమే అన్నాడు. దీన్నే సోషలిస్టు విప్లవం అన్నాడు. ఆ తరువాత యిక కిందివర్గాలే లేవుగనుక ఆ విప్లవా నంతరం వర్గరహితసంఘం అమలులో వుంటుందని చెప్పాడు. ఎన్ని చెప్పినా మార్క్సు ఎప్పుడూ దేన్నీ శాసించలేదు. ఇట్లాంటి పరిస్థితుల్లోయిట్లాజరుగుతుంది అనిమాత్రమే చెప్పాడు. ధనికవాదం బాగా అభివృద్ధిచెందిన దేశంలో సోషలిజం వస్తానికి కావలసిన పరిస్థితులన్నీ తయారు కాబడతయి,

అన్నాడు. కాని అక్కడైనా కార్మికవర్గం ప్రభుత్వంపై విప్లవాన్ని చేసి రాజకీయాధికారాన్ని చేపట్టితేనేగాని, లేకపోతే అది జరక్కపోనచ్చును అనికూడా చెప్పాడు. అంతేగాని, కొన్ని దేశాలలో, కొన్ని కొన్ని విపరీతపరిస్థితులు సృష్టించబడినప్పుడు, కొన్ని కొన్ని సంభవాల యాదృచ్ఛిక కలయిక జరిగినప్పుడు, కలిగిన ఫలితాలనుగురించి మార్క్సు ఏమీ చెప్పలేదు. అవి సంభవించినంత మాత్రాన మార్క్సిజం తప్పు అనడం కేవలం మూర్ఖత్వం. రష్యావిప్లవంగూడా అదేవిధంగా కొన్ని విపరీతపరిస్థితులలో, కొన్ని విపరీతసంభవాల యాదృచ్ఛిక కలయికవల్ల జరిగిన ఫలితం. రష్యా విప్లవాన్నిబట్టి మార్క్సిజం తప్పుబోయింది అనేవారు, కేవలం రష్యావిప్లవ స్వభావాన్ని గ్రహించలేనివారే.

రష్యావిప్లవం మార్క్సిజాన్ని ఏ విధంగానూ వ్యతిరేకపరచలేదు. అసలు యిది అర్థంలేనిమాట. మార్క్సిజం మానవుని ఆలోచనావిధానం, జిజ్ఞాస, ఏవిధంగా అభివృద్ధి చెందుతూ వచ్చిందో క్రోడీకరించి చెప్పే శాస్త్రం అయినప్పుడు, దాన్ని వ్యతిరేకించడం వుంటుంది అని ఎవరన్నా అంటే వారికి మార్క్సిజాన్ని చదువుకొనే పరిజ్ఞానంలేదన్న విషయాన్ని రుజూచేస్తుంది. అట్లాంటి అజ్ఞానదశలో మానవుడు చాలాకాలం వున్నాడు. అందువల్ల యిప్పటికీ మానవుల్లో ఆ అజ్ఞానం యింకా తలెత్తుతూవుండడం సహజమే.

కాని రష్యావిప్లవం మాత్రం కొన్నికొన్ని కొత్తవిషయాల్ని నేర్పింది. మార్క్సిజానికి రష్యావిప్లవం మరో నూతనాధ్యా

యాన్ని కల్పించింది. మార్క్సిజాన్ని యింకా అభివృద్ధిజేస్తానికి మాత్రం మనకు రష్యావిప్లవం కొన్ని పాఠాలునేర్పింది అని చెప్పొచ్చు.

(1) విప్లవాలను తరగతివారీగా విభజింపలేమనీ, ఒక విప్లవం రెండుస్వభావాలు కలిగివుండవచ్చునను, అని రష్యావిప్లవాన్నుంచి మనం నేర్చుకోవచ్చు. రష్యా వ్యావసాయిక దేశం గనక అక్కడ "రైతుకిభూమికావాలి" అన్న నినాదంకింద వ్యావసాయిక విప్లవం జరిగినప్పటికి ప్రభుత్వం కేవలం ఆ వర్గప్రభుత్వం మాత్రం కాదు. గ్రామాలలో బూర్జువా ప్రజాస్వామిక ప్రభుత్వ స్వభావమైతే పారిశ్రామికపట్టణాలలో ప్రొలిటేరియన్ నియంతృత్వ స్వభావంవుంది. అంటే ఆప్రభుత్వస్వభావంలో బూర్జువా ప్రజాస్వామికస్వభావమూ, ప్రొలిటేరియన్ స్వభావమూ రెండూమిళితమైవున్నాయి. ఎక్కువగా మాత్రం బూర్జువా ప్రజాస్వామిక స్వభావమే. ఈ మిశ్రమస్వభావానికి కారణం అక్కడరావలసిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవం చాలా ఆలశ్యంగా రావటం వల్లా, ఆ విప్లవనాయకత్వం కార్మికవర్గం చేతుల్లో పట్టంవల్లా.

(2) మనం నేర్చుకోతగ్గ రెండోవిషయం ఏమిటంటే విప్లవానంతరం స్థాపింపబడేప్రభుత్వంయొక్క స్వభావాన్ని సిద్ధాంత రీత్యా ముందుగానే నిర్ణయించలేము అని. పార్లమెంటరీ ప్రజాస్వామికాన్ని కూలద్రోయ్యాలంటే ప్రొలిటేరియన్ నియంతృత్వం అక్కర లేదని రష్యావిప్లవం రుజూచేసింది. పార్లమెంటరీ ప్రజాస్వామికాన్ని అణచి పెట్టేవరకూ నియంతృత్వ విధానాన్ని

అవలంబించినా రష్యా విప్లవ సాంఘిక స్వభావం మాత్రం చాలా విశాలంగా వుంది. అది అన్నివర్గాల ప్రాతినిధ్యంతోనూ కూడుకొనివుంది. ఈ అనుభవాలన్నీ మార్క్సిస్టు సిద్ధాంతాల్ని బలపరుస్తవేగాని వ్యతిరేకించవు. ఒక విప్లవానంతరం ఏర్పడే ప్రభుత్వంయొక్క సాంఘిక స్వభావం ఆవిప్లవంలో పాల్గొనే వర్గాలనుబట్టి వుంటుంది అన్న మార్క్సిస్టు సిద్ధాంతాన్ని రష్యావిప్లవం బాగా బలపరిచింది.

(3) రష్యా విప్లవం మనకు మరోపాఠాన్నిగూడా నేర్పింది. అదేమిటంటే, ఒకదేశంలో సోషలిజం స్థాపించాలంటే ముందు ప్రొలిటేరియన్ నియంతృత్వం, అనివార్యంగా స్థాపించవలసిన ఆవశ్యకత లేదు అని.

# V

విప్లవాన్ని జయించటం ఎంత కష్టమైనపనో, ఆవిప్లవాన్ని జయించిన మీదట దానిఫలితాలను జారవిడవకుండా కాపాడుకోవడంగూడా అంతకష్టమైన పనే. బోల్షివిక్ పార్టీ అక్టోబరు విప్లవాన్ని జయించింది అంటే, అప్పుడు రష్యాలోవున్న అసాధారణ పరిస్థితులే చాలావరకు కారణమని చెప్పాలి. కెరన్‌స్కీ ప్రభుత్వం చేసిన తప్పుడునడక, రైతుల్లో నానాటికీ అభివృద్ధి చెందుచున్న అసంతృప్తి, యుద్ధంవల్ల నిత్యజీవితంలో కలిగిన కష్టాలు, జారు పదభ్రష్టత—అన్నీ—ఆవిధంగా కలిసివచ్చినయి. దీనికితోడు లెనిన్‌యొక్క అసాధారణ మేధాసంపత్తి విప్లవ విజయానికి ఎంతో తోడ్పడింది. రష్యా విప్లవ సమయంలో

సైనిక తిరుగుబాటు జరిగిందంటే లెనిన్‌యొక్క మేధా శక్తే కారణమని చెప్పాలి. దేశాన్నంతటినీ కూడగట్టుకొని రాగలిగిన ఆమూడు నినాదాలు—"భూమి, తిండి, శాంతి," "రైతుకి భూమికావాలి" "అన్ని హక్కులు సోవియట్లకే"—బోల్షివిక్‌పార్టీ ఆసమయంలో యిచ్చింది అంటే, లెనిన్ నాయకత్వమే కారణమని చెప్పితీరాలి.

ఆ అసాధారణపరిస్థితుల తోడ్పాటువలన జయించిన విప్లవ ఫలితాల్ని కాపాడుకోవడంగూడా దుస్సాధ్యమైన పనిగానే కనిపించింది. కాని విప్లవ విజయానికి ఎట్లాఅయితే కొన్ని అసాధారణ పరిస్థితులు కలసివచ్చాయో, విప్లవఫలితాల్ని కాపాడుకోవడానికికూడా మరికొన్ని అసాధారణ పరిస్థితులే తోడ్పడ్డయి. బోల్షివిక్‌పార్టీ అధికారాన్ని చేపట్టగానే లెనిన్ మేధాసంపన్నుడు గనక, ఆ అధికారాన్ని జారవిడుచుకోకుండా కాపాడుకోవాలంటే ఏమిచెయ్యాలో ఆలోచించాడు. అప్పుడురష్యాతో యుద్ధంచేస్తున్న జర్మనీ సామ్రాజ్యవాదులతో బ్రెస్టు—లిటోవ్‌స్క (Brest-Litovsk) సంధి చేసుకున్నాడు. జాతీయ దృక్పథంతో ఆలోచిస్తే యీసంధి రష్యాజాతికి చాలా అవమానకరమైన సంధి అని చెప్పాలి, కాని లెనిన్ సంకుచిత జాతీయవాదికాడు. అతడు మార్క్సిస్టు. అంతేకాకుండా అప్పటి ఆ పరిస్థితుల్లో రష్యా యుద్ధంలో దెబ్బతినకుండా వుండాలి అంటే, ఏ జాతీయవాదిఅయినా అంతకంటె మరేమీ చెయ్యలేడు. చేసినా దేశంలో సహకారమే దొరక్కుండా కెరెన్‌స్కీ ప్రభుత్వానికి పట్టినగతే పట్టేది. ఇటు దేశంలోని పీడిత ప్రజా

సామాన్యం యొక్క మనస్తత్వాన్ని అటు యుద్ధరంగంలో రష్యాకువున్న అవకాశాల్ని అన్నిటిని సమగ్రంగా అర్థంచేసుకున్నాడు గనకనే లెనిన్ ఆసంధిచేసుకున్నాడు. ఆసంధివల్లరష్యా కొంత భూభాగాన్ని జర్మనీకి వొదులుకోవలసివచ్చింది. ఆసంధి యావత్తూ జర్మనీవిజయాన్నిరష్యాపరాజయాన్ని ప్రతిబింబిస్తుంది అని భావించారు అందరూ—ఒక్క లెనిన్ తప్ప. అందుకనే ఆసంధి వొప్పుకుందాం అని లెనిన్ అప్పుడు బోల్షివిక్ పార్టీ సమావేశంలో తీర్మానం పెడితే అందరూ ఎదురుతిరిగారు. లెనిన్ జర్మనీ సామ్రాజ్యవాదుల ఏజంటు అనికూడా అన్నారు, కొందరు పార్టీనాయకులు. కొన్ని రోజులు పార్టీసమావేశంలో పోరాడి చివరకు తన విధానమే మంచిది అనిపించుకొని పార్టీ అనుమతిమీద లెనిన్ జర్మనీతో ఆ సంధిచేసుకున్నాడు. ఆ సంధియేగనక లెనిన్ జర్మనీతో చేసుకోకపోతే అక్కడ బోల్షివిక్‌పార్టీ అధికారంలో వుంటంగాని, యీనాడు రష్యా సోషలిస్టు దేశంగా వుంటంగాని జరిగేదేకాదు. ఆ సంధివల్ల వారు మూడు విధాల లాభించారు.

(1) రైతులు, సైనికులు దేనికోరకైతే గగ్గోలు పెట్టారో ఆ "శాంతి"ని బోల్షివిక్‌పార్టీ యీ సంధిద్వారా నెలకొల్ప గలిగింది. అటు యుద్ధంచెయ్యవలసిన అవసరం ఎప్పుడైతే ఈ సంధివల్ల లేకుండా పోయిందో యిటు దేశంలో తమ ప్రభుత్వాన్ని సుస్థిరం చేసుకొనేటందుకై ప్రయత్నించడానికి బోల్షివిక్‌పార్టీకి అవకాశం లభించింది. అంతేగాకుండా యుద్ధంచేసే అవసరం తీరింది గనుక, సైనికులు ఎవరియిండ్లకు వాళ్లు వారి

వారి ఆయుధాలతో తిరిగిపోవడం సంభవించింది. యీవిధంగా దేశమంతటా పంచినట్లువున్న యీ సైనికులు దేశమంతటా గూడా బోల్షివిక్ పార్టీ ప్రభుత్వాన్ని కాపాడడానికి సిద్ధమయ్యారు.

(2) రాజ్యతృష్ణతో యుద్ధానికి తలపడ్డ జర్మనీ సామ్రాజ్యవాద ప్రభుత్వం యీ సంధిద్వారా కొంత రాజ్యభాగాన్ని ఆక్రమించుకో గలిగిందిగనక యిటు యుద్ధాన్ని విరమించుకొని అటు మిత్రరాజ్యాలపై యీ సైన్యానంతటినీ కేంద్రీకరించింది. ఈ కారణంచేత రష్యా ప్రభుత్వానికి కొంత తీరిక చిక్కింది.

(3) మిత్రరాజ్యాలు మొదట్లో రష్యావిప్లవకారులకు సానుభూతి చూపించాయి. దానికి కారణం జారుప్రభుత్వం సరిగ్గా జర్మనీతో యుద్ధంచెయ్యటంలేదు గనక, అక్కడి ధనిక వాదులు ప్రభుత్వాధికారాన్ని చేపట్టితే జర్మనీతో బాగా యుద్ధంచేస్తారని ఆకాంక్షించారు. కాని జారుప్రభుత్వం పడిపోవడమే గాకుండా, కెరన్‌స్కీ ప్రభుత్వంకూడాకూలిపోవడం, బోల్షివిక్ పార్టీ అధికారం లోకి రావడం, జరిగే సరికి మిత్రరాజ్యాలవారికి కన్ను గుట్టింది. ఏవిధంగా యీ కొత్త ప్రభుత్వాన్ని వూడబెరుకుదామా అని ఆలోచించే పరిస్థితుల్లో బ్రెస్టు-లిటోవ్‌స్క సంధి వార్త పిడుగులాగా వినపడింది. ఈ సంధివల్ల జర్మనీ రష్యాలో పోరాడుతున్న తన సైన్యాలన్నిటినీ వెనక్కు మళ్ళించుకొనిపోయి, మిత్రరాజ్యాలపైకి పంపించింది. అది మిత్రరాజ్యాలకు పెద్దదెబ్బ అవడమేకాకుండా రష్యా ప్రభుత్వానికి

గూడా సాయపడింది. బోల్షివిక్ పార్టీ ప్రభుత్వాన్ని కూలదోస్తానికి తంటాలుపడుతున్న రష్యాలోని విప్లవ విద్రోహశక్తులకు మిత్రరాజ్యాలు సైనికసహాయం పంపలేక పోయినవి. జర్మనీతో పోరాడే సరికే గుడ్లు వెళ్ళుకొచ్చాయి. బ్రెస్టు-లిటోవ్‌స్క్ సంధివల్ల రష్యా విజయం పొందిందీ, జర్మనీ విజయంపొందిందీ నిమ్మళంమీద గాని అందరికీ బోధపడలేదు.

అసలు మొదటినుంచీగూడా లెనిన్ గత యుద్ధానంతరం పశ్చిమ ఐరోపాలోని దేశాలలో—ముఖ్యంగా జర్మనీలో, సోషలిస్టు విప్లవం వస్తుందని ఆశించాడు. కాని గత యుద్ధానంతరం జర్మనీ, ఆస్ట్రియా, హంగెరి, బవేరియా మొదలైనదేశాలలో వచ్చిన విప్లవాలు అన్నీగూడా అక్కడి సోషల్ డెమొక్రాటిక్ పార్టీ నాయకులవల్ల అయితేనేమి, బూర్జువావర్గంవల్ల అయితే నేమి, రైతులవల్ల అయితేనేమి, విఫలమైపోయినవి. సోషలిస్టు విప్లవం రావడానికి మార్క్స్ చెప్పిన లక్షణాలన్నీ మరి జర్మనీలో అప్పుడు వున్నయి. అక్కడ ధనికవాదం బాగా అభివృద్ధిచెందివుంది. కార్మికవర్గం బాగా బలవత్తరంగావుంది, ఇక పురుషప్రయత్నం లేదు అందామంటే, అక్కడి సోషల్ డెమొక్రాటిక్ పార్టీలోని వామపక్షం మార్క్సిస్టు దృక్పథం కలదే అనిగూడా చెప్పొచ్చు. కాని అక్కడి విప్లవంమాత్రం ఫలించకుండా చిదిమివెయ్యబడింది. దానికి ప్రబలకారణాలు రెండు చెప్పొచ్చు.

(1) యుద్ధం విరమించగానే జర్మనీలోని బూర్జువావర్గం సైనికుల్ని తనకిందకు తీసుకొని వెళ్ళగలిగింది. అందుచేత

అక్కడ వచ్చినవిప్లవాన్ని యీ సైనికసహాయంతో బూర్జువా వర్గం చిదిమివెయ్యగలిగింది. పైగా జర్మనీలోని విప్లవకారులకు సహాయంచేసే నిమిత్తం రష్యా పంపినసైన్యాలు వార్సా పట్టణంలోనే వోడించబడి వెనక్కువెళ్ళడం జరిగింది.

(2) జర్మనీలోని కార్మికవర్గం ప్రొలిటేరియన్ నియంతృత్వానికి మారుగా పార్లమెంటరీ ప్రజాస్వామిక ప్రభుత్వాన్నే కోరుకుంది. అందువల్ల అక్కడ సోషలిస్టువిప్లవం విజయం పొందలేకపోయింది.

ప్రపంచమంతటా ప్రొలిటేరియన్ విప్లవాలు నడపదగ్గదేశం పశ్చిమ ఐరోపాలోవుంది, అని ఎదురుచూచిన లెనిన్‌కు ఆశాభగం జరిగింది. జర్మనీలోగాని, లేక పశ్చిమ ఐరోపాలోని మరి యే యితరదేశంలోగాని, సోషలిస్టు విప్లవం విజయవంతమైతే, ఆ దేశం నిజంగా ప్రపంచమంతటా ప్రొలిటేరియన్ విప్లవాలు నడపడానికి నాయకత్వం వహించడానికి తగివుంటుందని, రష్యా ఆ దేశంవెనకే వెళ్ళడానికి తగివుంటుందనీ లెనిన్ ఆశించాడు. కాని పశ్చిమ ఐరోపాలో వచ్చిన విప్లవాలు ఏవీ విజయవంతంగా సాగలేదు. అట్లాంటిపరిస్థితుల్లో అంతర్జాతీయ కార్మికవర్గ దృక్పథానికి నాయకత్వం వహించడానికి రష్యా దేశానికి అర్హతలేకపోయినా నాయకత్వం తీసుకోక తప్పలేదు. ఆ స్థానం జర్మనీకేవుంది గాని రష్యాకులేదని లెనిన్‌కు బాగా తెలుసు. కాని, జర్మనీలో సోషలిస్టు విప్లవం వోడిపోయి పార్లమెంటరీ ప్రజాస్వామికం స్థాపించటం జరిగింది. హంగెరిలో సరియైన విప్లవనాయకత్వం లేకపోవడంచాతా, రుమేనియా

సైన్యాలు విప్లవాన్ని అణచడానికి అక్కడికిరావడం వల్లా హంగెరిలో సోషలిస్టువిప్లవం విఫలమైంది.

బవేరియాలో రైతులు ఎదురుతిరగడంవల్ల విప్లవం నెగ్గలేదు. అట్లాంటప్పుడు అంతర్జాతీయ కార్మికవర్గానికి నాయకత్వం వహించడం రష్యాకు తప్పలేదు.

అటు అంతర్జాతీయ కార్మికవర్గ పోరాటాలకు నాయకత్వం వహించటం, యిటు దేశంలో వచ్చిన విప్లవఫలితాల్ని జారవిడుచుకోకుండా కాపాడుకోవడం యీ రెండు కార్యక్రమాలు బోల్షివిక్ రష్యా నిర్వహించవలసివచ్చింది. ఈ రెండుఆదర్శాలను మనస్సులో వుంచుకొనే రష్యా ముందుకు నడవడానికి ప్రయత్నించింది. ఈ లెఖ్ఖలో ఎంతవరకు విజయాన్ని పొందిందో పరిశీలించాలి.

# VI

1918 నాటికి బోల్షివిక్ ప్రభుత్వపు పునాదులు యింకా బాగా నాటుకుపోలేదు. దేశం మధ్యలో ఎక్కడో కొంతస్థిరపడ్డా మధ్యేతర ప్రాంతాల్లో అన్నిటా ప్రభుత్వపుస్థితి చాలా ఒడుదుడుగ్గా వుంది. కొన్నికొన్ని ప్రాంతాల్లో యీనూతన ప్రభుత్వం (బోల్షివిక్ ప్రభుత్వం) దేశంలో స్థాపించబడిందన్న సంగతికూడా తెలియనిస్థితిలో ప్రజలున్నారు. ప్రభుత్వాన్ని సుస్థిరంచేసి ప్రభుత్వానికి అండగా నిలబడి అంతర్విప్లవాల్ని, పరప్రభుత్వాల దండయాత్రల్ని అణచివెయ్యగల బలవత్తరమైన సైన్యమన్నా లేదు. ఉన్న సైన్యానికైనా కావలసినంత

ఆయుధ సరఫరాగాని, ఆహారపదార్థాలుగాని, దుస్తులుగాని ఏవీలేవు. ప్రభుత్వాన్ని నిలబెట్టుకోవాలంటే కేవలం ఒక్క విశ్వాసంగాని, విప్లవ నిజాయితీగాని, చాలవు. కట్టుదిట్టాలతో కూడిన సైన్యం, దానికికావలసినంత ఆయుధ, ఆహారపదార్థాలు గూడా కావాలి. సైనికులకు చాలినంత తిండిలేదు. దుస్తులు అంతకన్నా కరువయ్యాయి. పోరాటానికి నిలబడదామన్నా సరిపోయినంతఆయుధసంపత్తి లేదు. తుపాకీలుంటే మందులేదు. మందుంటేతుపాకీలు లేవు. ఉన్నవైనా తుప్పుపట్టి, మ్యూజియంలో పెట్టతగినవి.

దీనికితోడు దేశమంతటా యుద్ధఫలితంగా దరిద్రదేవత తాండవ మాడుతోంది. ఎక్కడచూచినా ఆకలి రాక్షసి కోరలుచాచి, నగ్ననృత్యం చేస్తోంది. దొంగతనాలు, బందిపోట్లు పట్టపగళ్ళు విచ్చలవిడిగా దేశమంతటా సాగిపోతున్నాయి. హత్యలు మొదలైన ఘోరాలు అవిఘ్నంగా సాగిపోతున్నాయి. తిండికరువు, బట్టకరువు దేశమంతటా బ్రహ్మాండమైన సమస్య అయింది. క్షుద్బాధాపీడితమైన ప్రజానీకం నూతన ప్రభుత్వంతో సహకారం చెయ్యడమా లేక, ప్రత్యాఘాతక శక్తులతో కలవడమా అన్న సందిగ్ధావస్థలో వుంది.

అగ్నికి వాయువు తోడైనట్లు దేశంలో మూలమూలలా యీతుధాగ్ని జ్వాలలుప్రజ్వలిస్తూంటే, దీనికిదోహదంగాఅంత ర్విప్లవావిర్భూతమైన వాయువు దేశంలో చాలాచోట్ల వీవ సాగింది. జారుప్రభుత్వ పునస్థాపనాభిలాషులు, మెన్షివిక్ పార్టీ సభ్యులు, మిలిటరీనాయకులు' యుద్ధరంగాన్నుంచీ పలాయ

నాన్ని చిత్తగించి వచ్చిన సైనికులు కొందరూ, క్షుద్బాధా పీడితులైన మధ్యతరగతి రైతులు కొందరూ, పట్టణాల్లోని ధనికవర్గం, గ్రామసీమల్లోని భూస్వాములు (కులాక్సు) అంతా బోల్షివిక్ ప్రభుత్వంపై అంతర్విప్లవం తెస్తానికి ఎక్కడికక్కడ తీవ్రప్రయత్నాలు చేస్తున్నారు. ఈఅదును కనిపెట్టి కోర్నిలోవ్, డెనికిన్, కోల్చాక్‌ల వంటి విప్లవ వ్యతిరేక నాయకులు అంత ర్విప్లవ సారథ్యానికి సంసిద్ధులయ్యారు. వీటన్నిటినీ మించి1918-1920 ల మధ్య బోల్షివిక్ ప్రభుత్వం దేశంలో అమలుజరిపిన ఆర్థిక విధానం గోరుచుట్టుపై రోకటిపోటు అయింది. రైతులు భూస్వాముల్ని తొలిగించి, తాము సేద్యంచేస్తున్న భూమికి తామే హక్కుదారులమని ప్రకటించుకొంటున్న రోజులవి. ఆ సమయంలో బోల్షివిక్ ప్రభుత్వం దేశంలో సేద్యానుకూల మైన భూమినంతా ప్రభుత్వపరం చేశామని, రైతులు పండించే ధాన్యంలో వారి జీవనాధారానికి సరిపోయినంతపోగా మిగతాది సమిష్టిప్రయోజనం నిమిత్తం యిచ్చివెయ్యాలంటూ ఒక కొత్త డిక్రీ యిచ్చింది. రైతులు స్వేచ్ఛావ్యాపారం చెయ్యటానికి వీలులేకుండాచేసింది. అంతేగాకుండా దేశంలోవున్న బ్యాంకులు రైల్వేకంపెనీలు, తంతివార్తాసంస్థలు, అధిక సంఖ్యాకమైన భారీకర్మాగారాలు, అన్నిగూడా ప్రభుత్వపర మయ్యాయని మరొక డిక్రీ అమలు జరిపింది. దీని ఫలితంగా దేశంలోని ఆర్థిక వ్యవస్థకు చాలా తీరనిదెబ్బ తగిలింది. విప్లవంలో పాల్గొని, పోరాడి జయించిన రైతులు తమకు కావలసిన భూమి తమకు దక్కిందని సంతోషపడుతున్న అట్లాంటి సమయంలో యీ

కొత్త డిక్రీ అసంతృప్తి కలిగించింది. అందువల్ల వారు తమ కనీసపు అవసరం ఎంత వుంటుందో అంత కంటే అధికంగా పండించడం మానివేశారు. కర్మాగారాల్లో ప్రజావసరాలను తీర్చే పదార్థాల్ని గాకుండా మిలిటరీ అవసరాలనుతీర్చే పని ముట్లను వుత్పత్తిచేయించడం మొదలుపెట్టారు. వాటిల్లో పని చేసే కార్మికులకు ప్రతిఫలంగా తక్కువ రేషన్‌లో ఆహారపదార్థాల్ని, యితర పదార్థాల్ని యివ్వడం ప్రారంభించారు. డబ్బు రూపేణా వారికి వేతనా లివ్వడమే మానివేశారు.

ఇంకొకవిషయం గమనించాలి. బోల్షివిక్ పార్టీ అధికారం లోకి వచ్చేసరికే అసలు దేశంలో డబ్బుకు (కరెన్సీకి) విలువే నశించింది. క్షణక్షణానికొక కరెన్సీరావడం దీనికిప్రధానకారణం. జారుప్రభుత్వం, ఆతదుపరి కెరెన్‌స్కీప్రభుత్వం, తరువాతఅక్కడక్కడా మిలటరీ నాయకులు స్థాపించిన ప్రభుత్వాలు, బోల్షివిక్ ప్రభుత్వం, తిరిగి కొన్ని కొన్ని రాష్ట్రాలలోని ప్రత్యాఘాతక శక్తుల ప్రభుత్వాలు—యివన్నీ గూడా వాటివాటి తాలూకు కరెన్సీలను దేశంలోకి పంపడంవల్ల కరెన్సీకి చెత్త కాగితాలకున్న విలువకూడా లేకుండాపోయింది. ఉదాహరణకు ఒక్క ఉక్రైన్ రాష్ట్రంలో మూడు నెలలు నిండకమునుపే 14 రకాల కరెన్సీలు, 14 రకాల ప్రభుత్వాలు మారాయి.

ఈవిధంగా బోల్షివిక్ ప్రభుత్వం అమలుజరిపిన ఆవిధానాన్ని వార్ కమ్యూనిజమనీ, మిలిటరీ కమ్యూనిజమనీ పిలిచారు. ఈ విధానాన్ని బోల్షివిక్ ప్రభుత్వం ఎందుకు ఆచరణలో పెట్టింది అంటే కొందరు ఒక కారణం, మరికొందరు యింకొక కారణం

చెబుతారు. బోల్షివిక్ పార్టీ నాయకులు, అక్టోబరు విప్లవంతో రష్యాలో సోషలిస్టు విప్లవం వచ్చిందని భావించారనీ, అందు వల్ల సోషలిస్టు సూత్రాలన్నీ ఆచరణలో పెట్టాలని అంచనా వేసుకొనే వార్ కమ్యూనిజాన్ని అమలుజరిపారని ఒక తెగవా రంటారు. కాని దీనికి ఆధారం ఏమీలేదు. బోల్షివిక్ పార్టీ నాయకుల్లో కొందరు ఒక వేళ ఆవిధంగా వూహించి వున్నప్పటికీ, లెనిన్ మొదలైన మహానాయకులకు ఆ విషయంలో ఎలాంటి దుర్భ్రమలు లేవని ఆ తరువాత 1921 లో లెనిన్ ఆచరణలో పెట్టిన నూతన ఆర్థికవిధానం-NEP-వల్లగాని, దాన్ని ప్రవేశపెడుతూ లెనిన్ చెప్పిన మాటలవల్లగాని తెలుస్తూనే వుంది.

'మనకు కావలసింది సోషలిజంగాని, కేపిటలిజం కాదు' అని ఎవరో ఒక నాయకుడు ఆ సందర్భంలో అంటే లెనిన్ యిలా సమాధానం చెప్పాడు.

"అబ్బాయీ! సోషలిజం అనేది నీకు ఎప్పుడు కావాలంటే అప్పుడు ఒక ప్లేటులో పెట్టుకొని తీసుకరావటానికి అదేమన్నా పదార్థ మనుకొన్నావా?"

అయితే మరి వార్ కమ్యూనిజం వంటి హానికరమైన ఆర్థిక విధానాన్ని 1918-20 ల మధ్య ఎందుకు ఆచరణలో పెట్టారు? అన్న ప్రశ్నకు కొంద రీ విధంగా సమాధానం చెబుతారు.

బోల్షివిక్ పార్టీ తన ప్రభుత్వాన్ని స్థాపించిందన్నమాటేగాని అప్పట్లో అది ఎక్కడా బలపడలేదు. అప్పట్లో ఏర్పడినసమస్య లన్నింటిలోనూ బోల్షివిక్ పార్టీ కేంద్రసంఘంలో సైతం ఏకాభి ప్రాయం లేకుండావున్న రోజులవి. 'బ్రెస్టు-లిటోవ్‌స్కు, సంధి జర్మనీతో చేసుకుతీరాలి.' అని లెనిన్ పట్టుబడితే కేంద్రసం ఘంలో అధికసంఖ్యాకులు వ్యతిరేకత చూపించడమే గాకుండా కొందరు, రష్యన్ విప్లవప్రభుత్వ సేనలు, జర్మనీ సామ్రాజ్య వాద ప్రభుత్వంపై యుద్ధం చెయ్యాలన్న అభిప్రాయాన్ని చూ పెట్టారు. వీరికి సోషలిస్టు రెవల్యూషనరీస్‌లోని తీవ్రవాదు లంతా సహకారాన్నిచ్చారు. సోషలిస్టు రెవలూషనరీస్‌లోని మితవాదులు, మెన్షివిక్‌పార్టీకి అండగా నిలిచి దేశంలో అంతః కలహాలు తెస్తానికి వుద్యుక్తులై వున్నారు. దేశంలో చెలరేగిన విప్లవ ప్రత్యాఘాతక శక్తులకు దోహదాన్నిస్తానికి, బ్రిటిష్ సేనలు, ఫ్రెంచి సేనలు, అమెరికన్ సేనలు, జెకోస్లొవాకియా సేనలు మొదలైన మిత్రసేనలన్నీ నెమ్మదిగా ఆయత్తమవా తున్నాయి. ఐరోపా ఖండంలో ప్రజాస్వామికం నిలబెట్టడానికి పవిత్రమైన యుద్ధాన్ని జర్మనీరాక్షసిపై చేస్తున్నామని చెప్పు కొంటున్న బ్రిటిష్‌సేనలు, అదేసాకుతో, అదే సమయంలో, జర్మన్ సేనలతో కలిసి బోల్షివిక్ ప్రభుత్వంపై తిరుగుబాటు తెస్తానికి రష్యాలో కృషిచేశాయి. ఈగాలిదుమారాన్నంతటినీ, అణచివేసి బోల్షివిక్‌పార్టీ స్థిరపడాలంటే బలవత్తరమయిన సేనలు తయారుకావాలి. అట్లాంటిసైన్యాన్నితయారుచేసే నిమి త్తమే రెవలూషనరీ మిలిటరీ కౌన్సిల్ ఒకదాన్నిస్థాపించారు.

ఈ కౌన్సిల్ నాయకుడుగా ట్రాట్‌స్కీ నియమించబడ్డాడు. ఈ రెవల్యూషనరీ మిలిటరీ కౌన్సిల్ 160 లక్షల సంఖ్యగల రెడ్ ఆర్మీని నియమించడానికి పూనుకుంది. దేశంలో చెలరేగు తున్న అంతర్విప్లవాలనించీ, పరప్రభుత్వాల జోక్యంనించీ (intervention) సొంతం తప్పించుకొన్నప్పుడుగాని బోల్షివిక్ ప్రభుత్వం దేశానికి ఏమేలు చెయ్యాలన్నా చెయ్యలేదు. ఆ ప్రమాదం తప్పించుకొనేంతవరకూ, దేశంలో క్షుద్బాధ మరీ పెచ్చుపెరిగినప్పటికీ ఏమీ చెయ్యలేదు. ఈ దృష్టితోనే వార్ కమ్యూనిజం దేశంలో అమలు జరుపబడింది. పండించే రైతుకు తింటానికి చాలినా చాలకపోయినా రెడ్ ఆర్మీలోని సైనికుడు కడుపునిండా తిండి తినితీరాలి. ఫ్యాక్టరీల్లో పనిచేసే కార్మికు డికి కట్టుకోవడానికి బట్ట లేకపోయినా రెడ్ ఆర్మీ సైనికుడు మాత్రం చలిబాధకు ఏమాత్రమైనాసరే లోనుకాగూడదు. ఈత్యాగం దేశం చేసితీరాలి, చచ్చితీరాలి, గత్యంతరం లేదు. వార్ కమ్యూనిజం యీ దృష్టిలో అమలుజరుపబడిందే గాని, అక్టోబరువిప్లవం సోషలిస్టువిప్లవమని ఊహించి సోష లిజాన్ని అమలుజరుపుతున్నామని అనుకొనిమాత్రం బోల్షి విక్ ప్రభుత్వం వార్ కమ్యూనిజాన్ని ఆచరణలో పెట్టలేదు.

1921 లో వార్ కమ్యూనిజాన్ని యింకా అమలుజరుప వలసిన అగత్యం ఏమాత్రం లేదని బోల్షివిక్ ప్రభుత్వం ఎప్పు డైతే భావించిందో వెంటనే ఆవిధానాన్ని ఉపసంహరించు కుంది. ఈ ఉపసంహారానికి ప్రథమప్రాతిపదికయే నూతన ఆర్థిక విధానం. కాని యీలోపల జరగవలసిన కర్మకాండ చాలా

క్రీ. శ. 1918—21 ల మధ్య రష్యా దేశంలో ఎక్కడికక్కడ ఒక మహాభారతయుద్ధం జరిగింది. కొడుకు బోల్షివిక్ ప్రభుత్వం కొరకై రణరంగానికి వెడితే, తండ్రి జారుప్రభుత్వ పునస్థాపన కొరకు, అన్న ప్రత్యాఘాతకశక్తుల విజయానికి, కదనరంగానికి వెళ్ళిన సందర్భం అది. దేశంలో జారుప్రభుత్వం తాలూకు అడవా దడవా మిగిలిన తొత్తులు, బడితొత్తులు, కార్మిక, కర్షక వర్గాలపాలిటి మృత్యువైన ధనికవర్గం, సైన్యాలు వొదిలిపెట్టి వచ్చినా మిలిటరీమహానాయకత్వాన్ని వొదులుకోలేని కొందరు అతిరథులు, మహారథులు, విప్లవ ప్రత్యాఘాతకశక్తులు, వీరందరినీకూడా బోల్షివిక్ ప్రభుత్వంపై పురికొల్పి, సహాయపడి అవసరమైతే చెయ్యిచేసుకొని, రష్యాలో సోవియట్ ప్రభుత్వ స్థాపనను అరికట్టే ధర్మకర్తృత్వాన్ని మిత్రరాజ్యాలు తమ భుజాలమీద వేసుకున్నాయి.

జర్మనీవారికి రష్యారంగంలోని సరఫరాలు అందకుండా వాటిని అరికట్టాలి అన్న మిషతో పంపబడ్డ మిత్రక్రూయిజర్లు పెట్రోగ్రాడ్‌పై ముట్టడిచేస్తానికి ప్రథమసేనల్ని దింపాయి.

అటు జకోస్లోవాక్ సేనలు వాల్గాప్రాంతంలోని సోవియట్లపై దాడిని ప్రారంభించాయి. కాకసస్‌లోని మెన్షివిక్స్, సోవియట్ రష్యాను, కాకసస్‌కు సంబంధంతొలగినట్లు ఆ దేసమయంలో ప్రకటించారు. క్రిమియా, సైబీరియాల్లో బూర్జువావర్గం తన ప్రభుత్వాన్ని స్థాపించుకుంది.

రష్యా దేశంలో అప్పుడు ఎక్కడబట్టినా ప్రస్థాన భేరీలు మ్రోగుతున్నాయి. పెట్రోగ్రాడ్ వంటి దిట్టమైన బోల్షివిక్

కోటలోనే శత్రుబీజం తలెత్త గలిగింది. మెన్షివిక్స్ సోషలిస్టు రెవల్యూషనరీస్ కలిసి కృషిచేసి పెట్రోగ్రాడ్‌లో సైతం కార్మికులచేత సమ్మెచేయించ గలిగారు. ఎక్కడబట్టినా ఆకలి, ఆక్రోశము, సాయుధ తిరుగుబాట్లు. మర్మాన్స్కు వద్ద యింగ్లీషువాళ్లు కూచున్నారు. వ్లాడివాస్టాక్ వద్ద జపాను వాళ్లు పొంచుకొనివున్నారు. ఉక్రైన్‌లో జర్మన్లు సిద్ధంగా వున్నారు. వోల్గావద్ద జకోస్లావాక్ సేనలున్నాయి. బోల్షివిక్ ప్రభుత్వం యొక్క పతనం యిప్పుడా, యింకా కొంచెం సేపటికా అన్నట్లున్న విషమ సమయం అది. అప్పుడే లెనిన్ "యుద్ధమా, మృత్యువా" అని సింహనాదం చేస్తూ ప్రస్థానభేరి మ్రోగించాడు. "బోల్షివిక్ ప్రభుత్వాన్ని నిలబెట్టు కోదలచుకొన్నారా అన్ని సోవియట్లు సుస్థిరంగా నిలబడి ప్రభుత్వానికి అండగా వుండేటట్లు చెయ్యండి. మీకు దానికి ప్రతిఫలంగా సోవియట్ ప్రభుత్వం సత్వరమే చేసేదేమిటి, అంటే, ఏమీలేదనేచెప్పాలి. కాని "పనిచేసేవాడే తిండితినాలి" అన్న నినాదాన్ని మాత్రం బోల్షివిక్ ప్రభుత్వం అమలు జరుపుతుంది. కాక రష్యన్ సోవియట్లు అన్నీ ప్రత్యాఘాతక శక్తులకు తోడ్పడతా యంటారా సరే తోడ్పడనివ్వండి. అప్పుడు దేశంలో తిండి దొరుకుతుంది!!! సమృద్ధిగా దొరుకుతుంది!!! కాని ఎవరికి? నూటికి ఒక్కడో, అరో, అయిన ఆ ధనిక వర్గానికి, మాత్రం చేతులా,కాళ్లా తింటానికి సరిపోయినంత తిండి దొరుకుతుంది!!! ప్రజాసామాన్యానికి దొరికేది మాత్రం తుపాకీగుండ్లు, తిరిగి యుద్ధరంగం, మిత్రమండలి సహాయంతో పతనమైన నికోలస్

జారుయొక్క ప్రభుత్వ పునస్థాపన. ఇది ప్రజాసామాన్యానికి దొరికేది, మిగిలేది. శ్రామికులు తిరిగి తుపాకీగుండ్లు తయారు చేసేఫ్యాక్టరీ ల్లో రోజుకు 16 గంటల చొప్పున పనిచేసి,అతుక్కు పోయిన డొక్కలతో కాళ్ళుముడుచుకొని హాయిగానిద్ర పోవచ్చు. రష్యాకు తిరిగి యుద్ధరంగం, ప్రత్యాఘాతశక్తులు చేసుకున్న రహస్య సంధిషరతుల ఆచరణకై తిరిగి జర్మనీతో యుద్ధం, ప్రజాబాహుళ్యంపై హత్యాకాండ, కాక సెక్ట్రేషన్ క్యాంపు అన్నీ మళ్ళీ అవిఘ్నంగా సాగుతాయి. ఇక రైతులకు మిగిలేదా కందకాలే. వారి భూములన్నీ తిరిగి భూస్వాముల పరంకాగా వారికి మిగిలేది కందకాలు, కాటకం, యుద్ధరంగం లో చేరమని అధికారులు చేసే జులుం ఏప్రభుత్వం కావాలో నిర్ణయించుకోండి. బోల్షివిక్ ప్రభుత్వం కావాలంటే అందరూ నిలబడి అన్ని సోవియట్లను అండగా నిలబెట్టండి. కాదా ప్రత్యాఘాతక ప్రభుత్వాన్ని వరించి, ఆకలిని, ఆక్రోశాన్ని, మృత్యువును కావలించుకోండి." అని లెనిన్ ఆసమయంలో చెప్పిన వీరోచిత గభీరవచనాలు రష్యన్ జాతికి ప్రవచనాలయ్యాయి. రష్యన్ కర్షకుడు తనకొరకు, తన భూమికొరకు నిలబడి పోరాడుతున్న బోల్షివిక్ ప్రభుత్వం కొరకై ఎంతటి కడుపుమంటకైనా, ఎంతటి ఆక్రోశాన్నయినా ఆఖరికి మృత్యువునైనా సహించానికి సిద్ధపడ్డాడేగాని కాళరూపం ధరించి యింకా తన కళ్ళల్లో మెదలుతున్న జారుప్రభుత్వాన్నిగాని, తాను విప్లవంలో పాల్గొని, స్వీయ హక్కు భుక్తంచేసుకొన్న భూమిని తిరిగి భూస్వామి కబళించుకు పోవడంగాని, అతను

సహించలేక పోయాడు. అందువల్ల, కరువుకి, కాటకానికి, వార్ కమ్యూనిజానికి గురిఅయిన రష్యన్ రైతు తిరిగి బోల్షివిక్ ప్రభుత్వం కొరకై ఆత్మార్పణం చెయ్యడానికి సంసిద్ధుడై నిలబడ్డాడేగాని ప్రత్యాఘాతక శక్తులకు తోడ్పడడానికి సిద్ధపడ లేదు. లెనిన్ ఆశయం ఫలించింది. రష్యన్ రైతాంగం తిరిగి తన చారిత్రక విప్లవపాత్ర నిర్వహించింది. అక్టోబర్ విప్లవంలో బోల్షివిక్ పార్టీకి ప్రాణమై నిలబడి పోరాడిన రైతాంగమే తిరిగి అక్టోబరు విప్లవానంతరం స్థాపింపబడ్డ విప్లావిక బోల్షివిక్ ప్రభుత్వంపై వచ్చిన బ్రహ్మాండమైన అంతర్విప్లవాన్ని తుడిచి పెట్టి బోల్షివిక్ ప్రభుత్వానికి తిరిగి ప్రాణంపోసింది.

ప్రత్యాఘాతక విప్లవం నెగ్గకపోవడానికి మరోకారణంగూడా వుంది. ప్రభుత్వ వ్యతిరేక శక్తుల్లో సహకారంగాని, ఏకీకృతాదర్శంగాని, కార్యక్రమంగాని ఏవీలేకపోవడం ఒక పెద్దకారణమయింది. అందువల్ల దేశంలో చెలరేగిన అంతర్విప్లవాగ్ని 1920 నాటికి చాలావరకు చల్లార్చ బడినప్పటికీ బోల్షివిక్ ప్రభుత్వానికి యింకా పరీక్షాసమయం దాటలేదు. 1921 నాటికి దేశంలోని విషమస్థితి యింకా ఏవిధంగానూ చక్క-బడలేదు. క్షుద్బాధా పీడితులైన కార్మికులు తిండి లేకపోయినా ఓర్పును తింటూ అప్పటిదాకా బోల్షివిక్ ప్రభుత్వాన్ని కంటికి రెప్ప మాదిరిగా కాపాడారు. తింటానికి యిక ఓర్పుగూడా ఏమీ వాళ్ళలో మిగలని స్థితిగూడా వచ్చింది. అప్పుడు వాళ్లుగూడా చాలాచోట్ల సమ్మెలకు పాలుపడ్డారు. కొందరు గ్రామసీమలకు క్షుధార్తులై వెళ్ళారు. మరికొందరు అరణ్యాల్లో బందిపోటు

జట్లుగా మారారు. కమ్యూనిస్టులు, శ్రామికుల బహిరంగ సభల్లో ప్రపన్యసిస్తుంటే, శ్రామికులు, గుంపులు, గుంపులుగా చేరి మాకు మీ ప్రపన్యాసాలు అక్కర్లేదు, వేదిక దిగిపోండి, మాకు మెన్షివిక్స్, సోషలిస్టు రెవల్యూషనరీస్ కావాలి. అని అరిచిన సందర్భాలు ఎన్నో వున్నాయి. పైగా దీనికి తోడు రెడ్ ఆర్మీలోనించీ చాలామంది పారిపోయి అరణ్యాల్లోని బంది పోటు జట్లతో కలవడం ప్రారంభించారు.

1921 ఫిబ్రవరి 23 వ తేదీన క్రాన్‌స్టాడ్‌లోని నావికులు సభచేసి "సోవియట్లకు తిరిగి ఎన్నికలు జరగాలి" "కమ్యూనిస్టులు లేని సోవియట్లుకావాలి" అని నినదిస్తూ తీర్మానించారు. దేశమంతా మళ్ళీ ఒక్కసారి ప్రతిధ్వనించి ది. క్రాన్‌స్టాడ్ కమ్యూనిస్టు పార్టీలో ఒక్కవంతు రెడ్ ఆర్మీకి తోడ్పడితే రెండు వంతులు తిరుగుబాటు దార్లకే తోడ్పడ్డారు. ధారా ప్రవాహంగా ఒక కమ్యూనిస్టువెంట మరో కమ్యూనిస్టు, పార్టీ సభ్యత్వానికి రాజీనామా యివ్వడం సాగించారు. ఈ తిరుగుబాటుకు అంతర్గతంగావున్న కారణం వార్ కమ్యూనిజం అని బోల్షివిక్ ప్రభుత్వం గ్రహించింది. క్రాన్‌స్టాడ్ తిరుగు బాటును రెడ్ ఆర్మీ అణచివెయ్యలేకపోయింది. తిరుగుబాటును అణచడానికి లెనిన్ ఒక్కటే ఆయుధాన్ని కనిపెట్టాడు. వార్ కమ్యూనిజాన్ని సత్వరమే విరమించుకొన్నట్టుగా ప్రకటించాడు. రైతు పండించే అదనపు ధాన్యంపై కొంత అధికమైన పన్ను వేస్తూ (యీ పన్ను గూడా ధాన్యంలోనే చెల్లించాలి) రైతు పండించే అదనపు ధాన్యాన్నంతా ప్రభుత్వవశం చేసుకొనే

విధానాన్ని వుపసంహరించాడు. అప్పుడే లెనిన్ నూతన ఆర్థిక విధానాన్ని ఆచరణలో పెట్టాడు. అది ఆచరణలోనికి వచ్చిన కొద్దికాలానికల్లా దేశంలో తిరిగి పట్టణానికి, గ్రామానికి మధ్య నిరంతరాయమైన స్వేచ్ఛా వ్యాపారం జరగడానికి ఎట్లాంటి నిషేధాలు లేకుండా చెయ్యబడ్డాయి.

# VII

లెనిన్ తన నూతన ఆర్థిక విధానాన్ని అమలుజరిపే సమయ యంలో రష్యా దేశమంతటా దారిద్ర్యం పిలిస్తే పలుకుతూంది. అసలే జారు నిరంకుశ ప్రభుత్వంక్రింద నలిగివుంది. దానికి తోడు మహాసంగ్రామం; ఆపైని చీటికి మాటికి ప్రభుత్వ తాబే దారులజులుం. దేశాన్నంతటినీ అల్లకల్లోలంచేసే రెండు మహా విప్లవాలు. బోల్షివిక్ పార్టీ అక్టోబరు విప్లవం జరిపి రష్యా దేశాన్ని యుద్ధరంగాన్నుంచీ ప్పించిందో లేదో తిరిగి విప్లవ ప్రత్యాఘాతక శక్తుల తిరుగుబాటు, యుద్ధాన్నుంచీ, ప్రత్యాఘాతక శక్తుల తిరుగుబాటునుంచి, రష్యా దేశాన్ని రక్షించే నిమిత్తం బోల్షివిక్ ప్రభుత్వం అమలుజరిపిన ఆర్థికవిధానం(వార్ కమ్యూనిజం); దానివల్ల దేశంలోని ఆర్థిక వ్యవస్థలో కలిగిన దుష్ఫలితాలు—వీటన్నిటివల్లా దేశంలో దరిద్రదేవత తాండవిస్తోంది.

కరువులో అధికమాసం అన్నట్లు క్షుద్బాధచేత నకనకలాడే ప్రజానీకానికిపైగా ఆ సంవత్సరం (1921) కరువు ఒకటి అధికంగా వచ్చిపడ్డది. రష్యా దేశంలో కరువుఎప్పుడూ మామూలే.

కాని 1921 సంవత్సరంలో వచ్చినంత భయంకరమైన కరువు అంతకుముందు రష్యా దేశచరిత్రలో ఎన్నడూ వినలేదు. దేశం లోని ఆర్థికవ్యవస్థ అదవదలై కూలిపోయేస్థితికి వచ్చింది. నూతన ప్రభుత్వం (బోల్షివిక్ ప్రభుత్వం) మీాద ప్రజానీకానికి, ముఖ్యంగా రైతులకు, విశ్వాసం తగ్గడం ప్రారంభించింది.

అట్లాంటి విషమ పరిస్థితుల్లో 1921 మార్చినెలలో రష్యన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్‌పార్టీ) పదవ కాంగ్రెసు సమావేశ మయింది. ఆకాంగ్రెసులో లెనిన్ ధైర్యంగా నిలబడి తననూతన ఆర్థికవిధానాన్ని ప్రవేశపెట్టాడు. పరిస్థితుల్ని చక్కగా అర్థం చేసుకొని, శాస్త్రీయ మార్క్సిస్టు దృక్పథంకలవాడు గనకనే లెనిన్ తన నూతన ఆర్థికవిధానాన్ని ప్రవేశపెట్ట గలిగాడు. అది విన్నప్పుడు అక్కడ సమావేశమయిన సభ్యులందరు ఆశ్చర్యపడ్డారు. హేళనచేశారు. కొందరు లెనిన్‌కు మతి పోయింది అన్నారు. మరికొందరు 'అతను సామ్రాజ్యవాదుల ఏజంటు' అన్నారు. కొందరు బుద్ధిమంతులు 'రెనగేడ్'అన్నారు. మరి కొందరు lackey of the bourgeoisie అన్నారు. 'మనకుకావలసింది సోషలిజంగాని, కేపిటలిజంకాదు' అన్నారు యింకా కొంతమంది. బూర్జువావర్గంవారు "అతను ఆపర్చు నిస్టు" అన్నారు. లెనిన్‌కు సన్నిహితులైన మరి కొందరు మాత్రం "నువ్వు ఒకఅడుగు వెనక్కువేస్తున్నావు" అని లెనిన్‌ను హెచ్చరించారు.

"అవును. రెండడుగులు ముందుకువేస్తానికై ఒక అడుగు వెనక్కువేస్తున్నాను." అని లెనిన్ సగర్వంగా సమాధానం

చెప్పాడు. "మీరందరూ భవనాన్ని చూపించమంటున్నారు. నేను మీకు యీపునాది చూపిస్తున్నాను. ఇది ఎట్లా భవనం అవుతుంది? అని మీరు నన్ను హేళనచేస్తున్నారు. నిజమే. పునాదులు భవనంకానిమాట వాస్తవమే, కాని పునాదులులేని భవనం మీరెక్కడైనా చూశారా? అట్లాంటిభవనాన్ని మీరెవరైనా నిర్మించగలరా?" అని లెనిన్ తిరిగి వారిని ప్రశ్నించాడు. లెనిన్ ప్రవేశపెట్టిన నూతన ఆర్థికవిధానాన్ని సక్రమంగా అర్థంచేసుకోవాలంటేముందు కొన్నివిషయాలు తెలుసుకోవాలి.

అక్టోబరు విప్లవం, సోషలిస్టువిప్లవం కాదన్న సంగతి లెనిన్‌కు బాగా తెలుసు. విప్లవానంతరం, అవసరపరిస్థితులను చక్కజెయ్యడానికిగాను తాత్కాలికవిధానంగా అమలుజరిపిన వార్‌కమ్యూనిజం యిత్యాదులైన సందర్భాలనుబట్టి అక్టోబరు విప్లవం సోషలిస్టువిప్లవమే అని భావించిన బోల్షివిక్ నాయకులు ఎవరైనా కొందరు వుంటే వుండవచ్చు. అట్లాంటివారే సోవియట్ ప్రభుత్వం తరువాత అమలుజరిపినవిధానాన్ని అర్థం చేసుకోలేక పోయారు.

వ్యావసాయిక దేశమైన రష్యాలాంటి దేశంలో సోషలిజం రావాలంటే పరిశ్రమలు వృద్ధిగావాలి. పరిశ్రమలు వృద్ధిచెంది సోషలిజం కావాలని కోరుకొని దానికి అండగానిలిచే proletariat వర్గం తయారయినప్పుడుగాని దేశంలో సోషలిస్టు వ్యవస్థాపనకు పరిస్థితులు అనుకూలించవు. దేశంలో పరిశ్రమలు అభివృద్ధి కావాలంటే

(1) సమృద్ధిగా యంత్రాలు కావాలి.

(2) యంత్రాలున్న పరిశ్రమలలో ప్రజలు పాల్గొని వాటిని వృద్ధిలోనికి తీసుకరావాలంటే వార్ కమ్యూనిజంలాంటి ఆర్థిక విధానం అమలుజరిపినందువల్ల ఏమీ ప్రయోజనంవుండదు. పైగా ప్రజలంతా ప్రభుత్వవిధానంపై విముఖులై వ్యతిరేకత చూపించడం జరుగుతుంది. అందుకు నిదర్శనం క్రాన్‌స్టాడ్ తిరుగుబాటే. ముఖ్యంగా రైతులు, నాగళ్ళు మూలబెట్టి కూర్చుంటూరేగాని అదనంగా పండించి ప్రభుత్వానికి కట్టబెట్టటానికి యిష్టపడరు. ఆఖరికి కార్మికులు సైతం ఫ్యాక్టరీల్లో పని మానివేసి సమ్మెలుచెయ్యడం, బందిపోటుజట్లలో చేరడంకూడా జరిగింది. అందువల్ల వార్ కమ్యూనిజం రద్దుచేసి ప్రజలందరూ, ముఖ్యంగా రైతులు, భూమిని సేద్యంచెయ్యడం, పరిశ్రమల్లో పాల్గొనడం, దేశంలోని ఆర్థికవ్యవస్థను సమున్నతం చెయ్యడం జరగాలంటే వారందరినీ కూడగట్టుకొనివస్తూ వారందరికీ ఆశలుచూపించే ఆర్థికవిధానం దేశంలో అమలు జరపాలి. లెనిన్ ప్రవేశపెట్టిన నూతన ఆర్థికవిధానం అందుకు పూనుకుంది. రైతులు పండించే ధాన్యం వారికి సరిపడగా వుంచుకొని మిగతాది కామన్‌స్టాక్‌కు యిచ్చివెయ్యాలన్న హుకుంను వుపసంహరించి, లెనిన్ నూతన ఆర్థికవిధానం, రైతులు పండించే పంటకు వారే హక్కుదారులన్న నిబంధనను అమలుజరిపింది. అదనపు వుత్పత్తిని (Surplus production) అంతా ప్రభుత్వం వశపరుచుకోనడానికి ప్రత్యామ్నాయంగా దానిమీద గ్రాడ్యుయేటెడ్ టాక్సు (graduated tax) వసూలుచెయ్యడం ప్రారంభించింది. తిరిగి బహిరంగవ్యాపారానికి (open market) అనుమతించింది. రైతులు పన్ను

చెల్లించగా మిగిలిన ఆహారపదార్థాల్ని ఓపెన్ మార్కెట్ లో తమ యిష్టంవచ్చిన ఖరీదుకు అమ్ముకొనేహక్కు ప్రసాదించ బడింది. సరుకులకు గరిష్టఖరీదును నిర్ణయించడం తీసి వెయ్యబడింది. భాగ్యవంతులు తమతమ పరిశ్రమలు ఎలాంటి భయంలేకుండా (ప్రభుత్వజోక్యం మొదలైనభయాలు) సాగించుకోవడానికి అవసరమైన నమ్మకాన్ని, ప్రాచీకతను యిచ్చింది ప్రభుత్వం. ఈ చర్యలన్నింటివల్లా రష్యాలో కేపిట లిస్టు వ్యవస్థను కమ్యూనిస్టుపార్టీ ప్రభుత్వమే స్థాపించడానికి పూనుకొన్నట్లుగా తోచింది విదేశాల్లో చాలామందికి.

పశ్చిమయిరోపాలో సోషలిస్టు విప్లవాలు జరుగుతాయని, అవి తప్పక నెగ్గుతాయని, అప్పుడు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థా పనా కార్యక్రమంలో రష్యా నిర్వహించవలసిన పాత్ర చాలా కొద్దిగానే వుంటుందని లెనిన్ మొదలైన రష్యన్ మహానాయ కులు వూహించిన వ్యూహాలన్నీ భగ్నమైనప్పుడు, రష్యా విప్లవ ఫలితాలను కాపాడుకోవడం అన్నది ఒక బ్రహ్మాండసమస్యగా మారింది. చుట్టుపట్ల దేశాలన్నీ-దిట్టమైన కేపిటలిస్టు దేశాలు- ఎప్పుడు వీలుచిక్కుతుందా, ఎప్పుడు రష్యన్ సోవియట్ ప్రభు త్వాన్ని కూలదోద్దామా అని పొంచుకొని వున్నాయి. రష్యా చూద్దామా కేపిటలిజం అభివృద్ధిచెందని దశలో వున్నది. పారి శ్రామిక ధనికవాదాన్ని దేశంలో వృద్ధిచేసుకుందామంటే అందుకుకావలసిన కేపిటల్ (యంత్రాలు, తదితర వుత్పత్తిసాధన పరికరాలు) దేశంలో లేదు. అప్పుయిచ్చే దేశాలా సుతరాం కనుపించడంలేదు. అట్లాంటి పరిస్థితుల్లో రష్యన్ కమ్యూనిస్టు

నాయకులు ఎన్నో సమస్యల్ని ఎదుర్కోవలసివచ్చింది. సాధించిన విప్లవాన్ని చెయ్యిజార్చుకొని దానిఫలితాలను జారవిడుచుకోవడమూ లేక కాపాడుకోవడమా? విప్లవఫలితాలు తామే అనుభవించాలంటే మరి ఆ పరిస్థితుల్లో ఎట్లా ముందుకుసాగాలి? చుట్టుపట్ల కేపిటలిస్టు దేశాలనించి తమకు కావలసిన కేపిటల్ దేశంలోకి ఎట్లా దిగుమతిచేయించుకోవాలి ? దేశంలో పారిశ్రామికాభివృద్ధి చేసుకుంటూనే కేపిటలిస్టు వుత్పత్తివిధానం అమలులోనికిరాకుండా వుండాలంటే ఏమిచెయ్యాలి? మొదలైన ప్రశ్నలు ఒకప్రక్కన బాధిస్తున్నాయి. వీటన్నిటిని పరిష్కరించుకొని రష్యా దేశంలో సోషలిస్టువ్యవస్థను నెమ్మదినెమ్మదిగా అమలుజరపడమూ లేక ప్రపంచవిప్లవం రాలేదు గనక ఒక్కరష్యాలో విప్లవంనెగ్గినా ప్రయోజనమేమిటని భావించి రష్యాదేశాన్ని విధికి వొప్పగించి తాము చేతులుదులుపుకొని అరణ్యాలకుపోయి ఆకు అలము మేస్తూ, ప్రపంచాన్ని త్యాజ్యం, త్యాజ్యం అనివొదిలేసి జపతపాలు చేసుకోవడమా, అన్నది మరొకసమస్య. ట్రాట్స్కీవాదులు ప్రపంచవిప్లవం నెగ్గలేదు గనుక రష్యావిప్లవంవల్ల మనం చెయ్యగలిగింది ఏమీ లేదని కాళ్లు బార్ల జాపారు. ప్రపంచ విప్లవంపై ఆశలుపెట్టుకొన్న మరికొందరు కమ్యూనిస్టు నాయకులుగూడా లెనిన్ ప్రవేశపెట్టిన నూతన ఆర్థికవిధానాన్ని, ఆ తరువాత స్టాలిన్ అమలుజరిపిన పంచవర్ష ప్రణాళికలను అర్థంచేసుకోలేక సోషలిజం గుడ్డుగుడిచి పోయిందని భీతిచెంది ప్రభుత్వవిధానంతో ఏకీభవించక ట్రాట్స్కీవాదులతో చేతులు కలపడం జరిగింది.

కాని లెనిన్ గొప్ప రియలిస్టు గనక అతని నాయకత్వంకింద రష్యన్ కమ్యూనిస్టుపార్టీ దుస్సాధ్యమైన ఆ కార్యక్రమాన్ని సాధించడానికి పూనుకుంది.

లెనిన్ నూతన ఆర్థికవిధానంవల్ల దేశంలో, తిరిగి స్వేచ్ఛా వ్యాపారం సాగింది. ప్రభుత్వం పారిశ్రామికవాదులకు ప్రక్కలోని బల్లెం అన్న భయం తీరింది. వ్యవసాయం సమున్నతంగా సాగింది. నూతన ఆర్థిక విధానాన్ని ప్రవేశ పెట్టినందువల్ల దేశంలో కొన్ని సత్వర ఫలితాలు కలిగాయి.

(1) దేశంలో ఆదవదలై, కూలిపోవడానికి సిద్ధంగావున్న ఆర్థిక వ్యవస్థ తిరిగి పుంజుకొని గట్టిపడడం జరిగింది.

(2) వ్యవసాయం బాగా అభివృద్ధిచెందింది. అందువల్ల ఆహారపదార్థాలు విరివిగా పండించడం జరిగింది. దేశానికి కావలసిన ఆహారపదార్థాల్ని మించి ఎన్నోరెట్లు అధికోత్పత్తి జరిగింది. ఆ అధికోత్పత్తిని రైతులు అమ్ముకొనేహక్కు వుంటంవల్ల వ్యాపారం బాహాటంగాసాగింది. ఆఅధికోత్పత్తిని ప్రభుత్వం విదేశాలకుపంపి(ముఖ్యంగాజర్మనీకి)ఆదేశాలనుంచియంత్రపరికరాలను, వుత్పత్తిసాధనాలనుదిగుమతి చేయించుకోవడం జరిగింది.

(3) దేశంలో ఆహారపదార్థాలు విరివిగా వుత్పత్తిగావటంవల్ల తక్కువకూలికే శ్రమ(labour) లభించడం జరిగింది. శ్రామికులకు ఆహారపదార్థాలు చాలా తక్కువఖరీదుకే లభించడంవల్ల వాళ్ళశ్రమనుగూడా చాలాతక్కువకే అమ్ముకొంటం జరిగేది. అందువల్ల, విదేశాలనించీదిగుమతిఅయ్యే యంత్రసామగ్రినల్లా, దేశంలో పారిశ్రామికాభివృద్ధి దినదినప్రవర్థమానంకాసాగింది.

కాని ఈ అభివృద్ధి అంతా కేపిటలిస్టు ఆర్థిక వ్యవస్థకు దారితియ్యకుండా వుంటానికి అవసరమైన జాగ్రత్తలన్నింటినీ ప్రభుత్వం తీసుకుంది. అందుకనే ప్రభుత్వం(banking system)అంతటిని తన అధీనంలో వుంచుకుంది; విదేశ వ్యాపారం. సరఫరామార్గాలు, వార్తాసంస్థలు అన్నీ తన అధీనంలో వుంచుకుంది; పట్టణ ప్రాంతాల్లోని భూమిని,కట్టడాల్ని తన అధీనంలో వుంచుకుంది; విద్యుచ్ఛక్తి, భారీపరిశ్రమలు అన్నీ తన అధీనంలోవుంచుకుంది; ట్రేడ్ యూనియన్ను, కొనుగోలుదారుల సహకార సంఘాలు (consumers' co-operative societies) తన కనుసన్నల్లోనడిచేటట్లు చేసుకుంది. అట్లాంటి పరిస్థితుల్లో నూతన ఆర్థిక విధానం వల్ల రైతులకు తాము పండించే పంటను మార్కెట్టులో అమ్ముకుంటానికి హక్కు నిచ్చినంతమాత్రాన, పట్టణాల్లోని వ్యాపారస్థులకు కాఫీహోటళ్లు తెరుచుకుంటానికి, చిన్న చిన్న షాపులు పెట్టుకుంటానికి, మందులషాపులు పెట్టుకుంటానికి గృహోపయోగార్థం పనికివచ్చే చిన్న చిన్న పనిముట్లు వుత్పత్తిచేసే ఫ్యాక్టరీలు నడుపుకుంటానికి హక్కునిచ్చినంత మాత్రాన, రష్యాలో భవిష్యత్తులో వ్యవస్థాపించనున్న collectivism కు ఎలాంటి ప్రమాదంరాదని లెనిన్‌కు తెలుసు. అది గ్రహించలేని వారూ, ప్రభుత్వానికి విరోధులైనవారూ మాత్రం, రష్యాలో collectivism అపజయం పొందిందనీ, ధనిక వాదం అభివృద్ధి చెందుతుందనీ, రష్యన్ కమ్యూనిస్టు నాయకులు, సోషలిజానికి విడాకులిచ్చి, ధనికవాదాన్ని చేపట్టారని, భ్రమపడి, దుష్ప్రచారం చేశారు.

# VIII

లెనిన్ తను నూతన ఆర్థికవిధానాన్ని ప్రవేశపెట్టినందువల్ల, బోల్షివిక్ పార్టీ ఆదర్శమైన సోషలిస్టు సంఘ వ్యవస్థాపనకు ఎక్కడా అపాయం రాలేదని అందరికీ అర్థమయ్యేట్టు చెయ్యాలంటే తన ఆర్థికవిధానం కొంతకాలం ఆచరణలో వుంటే చాలన్న నమ్మకం లెనిన్‌కువుంది. అందుకనే ఎవరెన్ని రకాలుగా విమర్శిస్తున్నా తను మాత్రం తన కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించాడు. తన కార్యక్రమం, విధానం ఎంత సబబైనవో, తన విధానంవల్ల సోషలిజం గుడ్డి గుడిచి పోకపోవడమే గాకుండా రష్యాలాంటి వ్యవసాయిక దేశంలో సోషలిస్టు వ్యవస్థాపనకు స్థిరమైన పునాదులు ఏవిధంగా వెయ్యబడ్డయ్యో అన్న విషయాలు నిదర్శన పూర్వకంగా, ఋజూచేసుకొని, తన ప్రతిభకు మెరుగులు పెట్టుకొనేవాడే కాని కాలం కలిసిరాలేదు.

లెనిన్ 1870 లో పుట్టాడు. అతని 17 వ ఏటనే తన అన్నయ్య అలెగ్జాండరు రాజకీయోద్యమంలో పాల్గొన్న ఫలితంగా వురిశిక్షకు గురికావడం చూశాడు. అతని జీవితాన్నే మార్చివేసింది ఆసంఘటన. అప్పటినించీ లెనిన్ తన జీవితాన్ని రాజకీయాలకు అంకితంచేశాడు. సంఘంలోవున్న దోపిడీ, దౌష్ట్యం, అన్నీ అతన్ని కలవరపరిచాయి. అప్పట్లో బాగా ప్రచారంలోవున్న మార్క్సిస్టు సిద్ధాంతాలు అతనికి నచ్చినయి. అప్పటినించీ సోషలిజమే తన ఆదర్శంగా పెట్టుకొని రాజకీయాల్లో పాల్గొనడం సాగించాడు.

పరిస్థితుల్ని లెనిన్ చాలా చక్కగా అర్థం చేసుకొంటాడు. సోషలిస్టు సాంఘిక వ్యవస్థకు మార్క్సు సూత్రకారుడైతే లెనిన్ కార్యశూరుడు. అక్టోబరు విప్లవం సోషలిస్టు విప్లవం కాకపోయినప్పటికీ విప్లవానంతరం రష్యాలో సోషలిజం వ్యవస్థాపించడానికి లెనిన్ వేసిన ప్రాతిపదికలే చాలు. అతని విషయ పరిశీలనా జ్ఞానాన్ని వాస్తవికత్వాన్ని ప్రతిభను వెల్లడిస్తానికి.

కాని మానవసంఘాన్నే గాకుండా మానవ మనోప్రవృత్తుల్నే మార్చివేసే ఆమహత్తర సోషలిస్టు వ్యవస్థను చూచే భాగ్యం లెనిన్‌కుగూడా అబ్బలేదు. లెనిన్ నూతన ఆర్థిక విధానాన్ని అమలుజరిపే సమయంలో "సోషలిజం ప్రవేశపెట్టు" సోషలిజం అమలు జరుపు" అని తాపత్రయపడ్డ స్నేహితులకు చెప్పిన మాటలే లెనిన్‌కుగూడా అన్వయించినయి.

"స్వచ్ఛమైన సాంఘిక విప్లవం (సోషలిస్టు విప్లవం) చూడదలుచుకొన్న వాళ్లుమాత్రం దాన్ని చూడలేకుండానే చచ్చిపూరుకుంటారు" అన్నాడు లెనిన్ తన స్నేహితులతో. కాని లెనిన్ మాత్రం వాళ్ళమాదిరిగా సోషలిజం వచ్చిందని కలలో కనలేదు. అందుకు తనువేసిన ప్రాతిపదికల ఫలితాలు చూడకుండానే మాత్రం లెనిన్ కన్ను మూశాడు. డోరాకప్లాన్ రివాల్వరుదెబ్బ తిన్ననాటినుంచీ లెనిన్ అనారోగ్యంగానే బతుకుతున్నాడు. 1924 జనవరి 21వ తేదీన ఆప్రపంచ మహావ్యక్తి, ఆవిప్లవమూర్తి, ఆ రష్యన్ భాగ్యవిధాత మహాప్రస్థానం చేశాడు.

# IX

నూతన ఆర్థిక విధానం అమలు జరపడంవల్ల పతనావస్థలో వున్న ఆర్థిక వ్యవస్థ కొంత చక్కబడింది. పారిశ్రామికాభివృద్ధి జరగడం సాగింది. వ్యాపార మార్గాలు నిర్విఘ్నంగా నడిచాయి. దీని ఫలితంగా రష్యాలో సోషలిజానికి బదులు కేపిటలిజం అభివృద్ధి చెందకుండా బోల్షివిక్ ప్రభుత్వం చాలా నిబంధనలు చేసింది.

సోషలిస్టు వ్యవస్థాపనకు అవసరమైన పారిశ్రామికాభివృద్ధి జరగాలంటే పారిశ్రామిక కూలీవర్గం దేశంలో బాగా తయారు కావాలి. రష్యాలాంటి వ్యావసాయిక దేశంలో పారిశ్రామిక కూలీలను తయారు చెయ్యాలంటే అంత తేలికైన పనిగాదు. వాళ్ళు యంత్రాలలో మెలగగల మనోప్రవృత్తులు, చైతన్యం, జీవనోపాధికి కావలసిన సౌకర్యాలు, పారిశ్రామిక విధానంలో పనిచెయ్యడానికి అవసరమైన పరిజ్ఞానం, అన్నీ వాళ్ళకు సమకూర్చాల్సి వచ్చింది.

కాగా పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన వుత్పత్తిసాధనాలు సమృద్ధిగా కావాలి. సోవియట్ ప్రభుత్వానికి చుట్టూవున్న కేపిటలిస్టు దేశాలు ఎప్పుడూ అప్పు పెట్టవు. అందువల్ల సాధ్యమైనంతవరకు యితర దేశాల సహాయం లేకుండానే రష్యా తన ఆర్థికాభివృద్ధి చేసుకోవాలి. వీటన్నిటిని ఆలోచించే ప్రథమ ప్రాతిపదికగా బోల్షివిక్ ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాన్ని అమలు జరిపింది. కాని కొంతకాలానికి దీనివల్లగూడా

అసామంజసరిగే సూచనలు పొడకట్టినయి. రష్యన్ భూస్వాముల (కులాక్స్) వద్దనించి విప్లవానంతరం రష్యన్ రైతులు భూమిని గుంజుకొని తమస్వాధీనం చేసుకున్నారు. సోషలిజం ఎప్పుడూ రైతులకార్యక్రమంగాదు. అందుకనే భూమిని సంపాదించుకొన్న రైతులు ప్రతి ఒక్కరూగూడా కులక్స్ స్థానంలోకి తాముపోవాలనీ తాముకూడా భూస్వాములే కావాలని వాంఛించడం సాగించారు. మార్క్సిజంచెప్పే వర్గస్వభావం(class character)సక్రమంగా అర్థంచేసుకొన్నవాళ్ళకిమాత్రం యిందులో విడ్డూరం ఏమీ లేదు. 1918-20 ల మధ్య సోవియట్ ప్రభుత్వం అమలు జరిపిన వార్ కమ్యూనిజం రైతువర్గానికి మేలు చేకూర్చదని తెలిసికొని రష్యన్ రైతులు భూమిని పండించడమే ఎట్లామానివేశారో, మనం వెనక బాగా చర్చించిన విషయమే. నూతన ఆర్థిక విధానంవల్ల రైతు తనుపండించిన ధాన్యం తిరిగి అమ్ముకొనేహక్కు ఎప్పుడైతే పొందాడో,అప్పుడేతిరిగి భూమిని కష్టపడి సాగుచేసి అధికంగాపండించి ఎక్కువలాభాలకు అమ్ముకోవడం ప్రారంభించాడు. అధికోత్పత్తి ప్రభుత్వానికి అప్పుడు బాగా అవసరంగనక వ్యాపార మార్గాల్ని అరికట్టకుండా వొదిలేసింది.

దీని ఫలితంగా రష్యన్ రైతుల్లో ఎకనమిక్ యిండివిడ్యువలిజం(economic individualism) రష్యన్ గ్రామసీమల్లో విలేజి కేపిటలిజం (village capitalism) అభివృద్ధి చెందసాగాయి. అంటే గ్రామాల్లో ధనికవాదం తలెత్తడం జరిగింది.

సాధారణ రష్యన్ రైతుల్లోనించి మళ్ళీ కొంతమంది కులాకుల్ని (భూస్వాములు) తయారు అవుతున్నారు.

అంటే నూతన ఆర్థికవిధానం తన చారిత్రాత్మక పాత్రను నిర్వహించి వ్యతిరేక ఫలితాలను కలిగించే స్థితికి వచ్చింది. రష్యన్ ప్రభుత్వం తాత్కాలిక అవసరాలకు, తాత్కాలిక విషమ పరిస్థితుల్ని తప్పించుకోవడానికి, తాత్కాలిక కార్య క్రమాల్ని యిచ్చే స్థితినిదాటి, సోషలిస్టు వ్యవస్థాపనా కార్య క్రమాన్ని అమలు జరిపేందుకు పూనుకుంది.

స్టాలిన్ అమలుజరిపిన మూడు పంచవర్ష ప్రణాళికలు కూడా యీదృష్టిలో తయారుచెయ్యబడ్డవే. పారిశ్రామికాభివృద్ధికి అవ సరమైన యంత్రాలు రష్యాలో విప్లవంనాటికి, విప్లవానంతరం పదిసంవత్సరాలవరకూ కూడా చాలా తక్కువగా వున్నాయి. ఏ దేశంలోనైనా సోషలిస్టువ్యవస్థాపన జరగాలంటే పరిశ్రమలు, పారిశ్రామిక కూలీవర్గం యివిరెండూ విరివిగా వుండాలి. పరి శ్రమలు అభివృద్ధి కావాలంటే వాటికి అవసరమైన యంత్రో త్పత్తి జరగాలి. యంత్రాలులేకుండానే పరిశ్రమలు అభివృద్ధి చెయ్యాలనడం సోషలిజంపేరుతో లిబరలిజానికి దారితియ్య డమే అవుతుంది. స్టాలిన్ ప్రవేశ పెట్టిన ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముఖ్యంగా యంత్రోత్పత్తి చెయ్యడానికే వుద్దేశించ బడింది.

1927 లో స్టాలిన్ నాయకత్వం క్రింద బోల్షివిక్ ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాన్ని వుపసంహరించి, 1928 సంవత్సరంలో

ప్రథమ పంచవర్ష ప్రణాళికను ప్రవేశ పెట్టింది. దీని ముఖ్యోద్దేశం యంత్రోత్పత్తి చేయడం. రష్యాలాంటి వ్యావసాయిక దేశంలో యంత్రోత్పత్తి, పారిశ్రామికాభివృద్ధి జరిగినంత మాత్రాన సోషలిజం స్థాపించడానికి అవకాశం లభించినట్లుగా భావించడానికి వీలులేదు. ప్రతి రైతు కాని రైతు కాస్త కొంచెం సంపాదించుకొని దాన్నే నమ్ముకొని, పురాతన సాధనాలతో, పాతపద్ధతిని వ్యవసాయం సాగిస్తున్నంత కాలం సోషలిజానికి అననుకూల పరిస్థితులే వున్నట్లవుతుంది.

కనకనే బోల్షివిక్ ప్రభుత్వం వ్యవసాయ శాఖలో కూడా పెద్దమార్పులు తెస్తానికి పూనుకుంది. యంత్రసహాయంతో, సమిష్టి పద్ధతిలో భూమిని సాగుచేసి అధికోత్పత్తి చెయ్యడానికి సంకల్పించుకుంది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమంలో యిది ఒకటి. ఇదంతా త్వరగా నెరవేరాలంటే ఎంతో త్యాగం జరగాలి. ఎంతో శీఘ్రగమనం కావాలి.

కేపిటలిజం ప్రపంచచరిత్రలో నిర్వహించవలసినపాత్ర కొంత ఉంది. కేపిటలిజంరావడానికి కావలసినపక్వపరిస్థితులున్న దేశాల్లో కేపిటలిజం వచ్చి తన పాత్ర కొంత నిర్వహించిన మీదట కొంత కాలానికి మిగతా దేశాల్లో కేపిటలిజం స్థాపించవలసి వస్తే పాతపద్ధతుల్లో దాన్ని ప్రవేశ పెట్టడానికి వీలుండక పోవచ్చు. అంటే వుదాహరణకు యిరోపాఖండంలో ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మనీ మొదలైన కొన్ని దేశాల్లో కేపిటలిస్టు వ్యవస్థాపన జరిగి కొంతకాలం గడచినతరువాత వ్యావసాయిక దేశ

మైన రష్యాలో విప్లవం వచ్చింది. అట్లాంటప్పుడు రష్యాలో పారిశ్రామికాభివృద్ధి ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మనీ దేశాల్లో జరిగి నట్లుగా జరగడానికివీలులేదు. అదే పాతపద్ధతిని రష్యాలోకూడా అమలు జరిపితే ఇతర దేశాలతో రష్యా సమానంగా నిలవలేదు.

కేపిటలిస్టు విధానంలో ప్రధానాంశం ముందు కొనుగోలు పదార్థాల (consumers goods) వుత్పత్తి ఎక్కువగాచేసి నెమ్మది నెమ్మదిగా వుత్పత్తిసాధనాలు వుత్పత్తి (production goods industry) చెయ్యడం. రష్యాలోకూడా యీపద్ధ తుల్లోనే పారిశ్రామికాభివృద్ధి జరగాలంటే ఆదేశాల్లో మాదిరి గానే కొన్ని శతాబ్దాలు పడతయి. ఇతర దేశాల్లో కొన్ని శతాబ్దాలపాటు నడిచిన చరిత్రను రష్యాలో బోల్షివిక్ ప్రభుత్వం కొన్ని సంవత్సరాల్లో దాట దలుచుకుంది. అందుకనే యితర దేశాల్లో మాదిరిగా కాకుండా అక్కడముందు వుత్పత్తిసాధ నాలను వుత్పత్తి చెయ్యడంతో పారిశ్రామికాభివృద్ధికి పూను కున్నారు.

ఇందుకుగాను తయారుచెయ్యబడ్డ ప్రధమ పంచవర్ష ప్రణా ళిక ఐదు సంవత్సరాలు నిండకమునుపే పూర్తి చెయ్యబడింది. దానికి కావలసిన త్యాగంజేశారు రష్యన్ ప్రజలు. దేశంలో ఎక్కడబట్టినా, ఎక్కడవిన్నా యిదే ప్రతిధ్వనించడం మొదలు పెట్టింది. గోడలమీద, గొబ్బెలమీద, ప్రభుత్వ భవనాల్లో, సినిమా, నాటకశాలల్లో ఎక్కడ చూచినా పంచవర్ష ప్రణా ళికనుగురించిన ప్రకటనలే కనిపించేవి. ఇతర దేశాల్లో వ్యాపార

సంస్థల ప్రకటనార్థం ట్రాంబళ్ళల్లోనూ, రైళ్ళల్లోనూ ప్రకటన స్థానంకోరకు బ్రహ్మాండమైనపోటీ జరుగుతుంది. రష్యాలో ట్రాంలు, రైళ్ళు, బస్సులు అన్నిట్లోనూగూడా పంచవర్ష ప్రణాళికను గురించేగాని మరో యితరవ్యాపార ప్రకటనలకు స్థానమే వుండేదికాదు. వార్తాపత్రికల మొదటిపేజీల్లోసైతం అంతర్జాతీయ రాజకీయాలకైనా స్థానం వుండేదికాదు. అన్నిపత్రికలూ ప్రతి రోజూగూడా పంచవర్ష ప్రణాళికను గురించే స్టీమరు చేసేవి.

వ్యవసాయక శాఖలో సమిష్టి విధానాన్ని (collective farming) ప్రవేశ పెడితేనేగాని యంత్రసహాయంతో సాగు చెయ్యడానికి వీలుచిక్కదు. నూతన ఆర్థిక విధానం ఫలితంగా వ్యక్తిగత లాభాలను మరిగిన రైతులు సమిష్టి వ్యవసాయ విధానానికి ఎదురు తిరిగారు. సమిష్టి వ్యవసాయంలో పాల్గొనే రైతులు వారివంతుభూమి ప్రకారం, వారివంతుశ్రమ ప్రకారం, లాభాలు పంచుకునే విధానాన్నే ప్రభుత్వం అమలు జరిపింది. అయినప్పటికీ రైతులు ఎదురుతిరిగారు. సమిష్టి వ్యవసాయం జరగండే రైతుల్లో కలగవలసిన మానసిక విప్లవం రానే రాదు. కాగా వారి సంతానం కమ్యూనిస్టు వ్యవస్థకు అనుకూలంగా ముందు ముందు ప్రవర్తించాలంటే వారికి చిన్నప్పటినించే యీ అనుభూతి, చైతన్యం,విజ్ఞానం కలిగించక తప్పదు. అందుకనే మాస్కో, లెనిన్‌గ్రాడ్ పట్టణాలనించి వందలాది ప్రచారకులు పల్లెటూళ్ళకుపోయి సమిష్టివ్యవసాయం వల్ల రైతులకు కలిగే లాభాలను గురించి వుపన్యాసాలు

యిచ్చేవారు. ఎన్ని చేసినా ప్రభుత్వం సమిష్టివిధానాన్ని బల వంతంగా, రైతుల అయిష్టానికి గురిఅయ్యే అమలు జరపవలసి వచ్చింది. రైతులు ఎక్కడికక్కడ ఎదురుతిరగడం సాగించారు. తమకున్న పశుసంపదనంతా చంపుకొని కాల్చుకుతుచుకొని, కాడి అవతల పారేసి కూచోవడం మొదలుపెట్టారు. 1927 సంవత్సరానికి ముందు ప్రభుత్వం కులాకుల్ని ఏవిధంగా, నిర్దాక్షిణ్యంగా హింసాకాండకు గురిచేసిందో, తిరిగి అదేవిధానాన్ని అమలు జరపవలసి వచ్చింది. ఎదురు తిరిగిన రైతులనించి, భూములు లాక్కొని నిర్బంధ కార్మిక క్యాంపుల్లోకి (compulsary labour camps)పంపించి పనిచేయడం ప్రారంభించారు.

సోవియట్ ప్రభుత్వం రాజకీయ, సాంఘిక, ఆర్థికపరిస్థితుల్ని మార్చడానికి చేసిన ప్రయత్నాలు కొంతకుకొంత తేలిగ్గానే ఫలించాయిగాని రైతు మనోప్రవృత్తి ఎప్పుడూ సోషలిజానికి వొప్పుకోదు. సెంటుభూమిగూడా లేని రైతులు సెమి-ప్రోలిటేరియన్ స్వభావం కలిగివుంటారన్న మాటేగాని, వాళ్ళ మన స్తత్వంగూడా తామూభూస్వాములవాలనే పద్ధతిలోనేపనిచేస్తుంటుంది. కనకనే సోవియట్ ప్రభుత్వం రైతువర్గ మన స్తత్వాన్ని బలవంతాన, శాసన సహాయంతో మార్చడానికి పూనుకుంది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక యంత్రోత్పత్తి చెయ్యడమేగాకుండా, సమిష్టి వ్యవసాయ విధానాన్ని అమలు జరపడానికి, సమిష్టి వ్యవసాయానికి అవసరమైన యంత్రాలు (Tractors,Harvester combines మొదలైనవి) నిర్మించడానికి పనిచేసింది.

సమిష్టివ్యవసాయం ఈవిధంగా రైతులయిష్టానికి వ్యతిరేకంగా అమలుజరిపినప్పటికీ, రైతులు సమిష్టివ్యవసాయంతోపాటుపక్కన కాస్త సొంతసాగుచేసుకోవడానికి, పశుసంపదను వృద్ధిచేసుకోవడానికివాటి ఫలితాలను స్వలాభంకొరకు అమ్ముకొని సొంతలాభాలుఏర్పరచుకోడానికిగూడా వీళ్ళుకల్పించింది ప్రభుత్వం. రైతు మనః ప్రవృత్తులు సోషలిస్టు వ్యవస్థాపనకు సుముఖంగా లేని కారణాన, దీని దుష్ఫలితాలు తిరిగి బాగా ప్రతి బింబించాయి. రైతులు సమిష్టి భూముల్లోకంటె సొంతభూముల్లోనే ఎక్కువగా పనిచేసుకుంటూ ఎక్కువ సొంతలాభాలు సొంత ఆస్తులు ఏర్పరచుకోవడం మొదలెట్టారు. సమిష్టి వ్యవసాయదారులనే పదం కేవలం ఒక బూటకంగా తయారయింది.

ప్రభుత్వం దీన్ని బాగా గమనించి 1939 లో తిరిగి రైతుల మీద కొన్ని కొత్త శాసనాలు అమలుజరిపింది. సొంతఆస్తిగా వుంచుకొనే భూమి పరిమితిని చాలా తగ్గించింది. సొంతంగా పోషించుకొనే పశుసంపద, సొంతఆదాయం మొదలైనవాటి మీద అధికంగా పన్నులు విధించింది. ఈ విధంగా రైతుల మీద ఒకటికి మూడుసార్లు దండయాత్ర చేసి వారి మనస్తత్వాలకు వ్యతిరేకమైన సోషలిస్టు వ్యవస్థాపనకు వారిచేతనే దోహద మిప్పిస్తానికి ప్రయత్నించింది.

ఇక్కడ మరొకవిషయం చెప్పాలి. సోషలిజానికి అవసరమైన పారిశ్రామిక కూలీవర్గాన్ని సృష్టించడానికి సోవియట్ ప్రభుత్వం చేసిన కృషి చాలావరకు ఫలించింది. కాని వ్యావసాయిక విధా

నానికి అలవాటుపడ్డ సంఘంలోనించి పారిశ్రామిక విధానంలో పని చెయ్యగల శ్రామికవర్గాన్ని తయారుచెయ్యాలంటే ఏమంత సులభమైన పనికాదు. కనకనే సోవియట్ ప్రభుత్వం అనేక కొత్త పద్ధతులు అవలంబించింది. స్త్రీ పురుషు లిద్దరికీ సమానహక్కులు కల్పించింది. పని పాటల్లో పాల్గొనే స్త్రీలకు పురుషులతో సమానంగానే వేతనాలిచ్చింది.

ప్రతివారికీ బాగాపనిచేసే యిచ్ఛ (incentive) కల్పించడానికై వేతనాల్లో వ్యత్యస్తాలను కల్పించింది. నేర్పరితనానికీ ఎక్కువ కాలం పనిచెయ్యగల శక్తికీ ఎక్కువగా వేతనాలివ్వడానికి ఏర్పాట్లు చేశారు. వేతనాల్లో యీవ్యత్యస్తాలు (differentiation of wages) వుంటంవల్ల ప్రతివారూ ఎక్కువనేర్పుతో పనిచేస్తారని ప్రభుత్వం తలంపు. శ్రామికులకు రేషనింగుద్వారా, తక్కువ ధరలకు సరుకులిచ్చే షాపుల్ని (closed shops) తెరవడం ద్వారా యింకా అనేకవిధాల ప్రభుత్వం యిదివరలో చేసిన సౌకర్యాలన్నీ తొలగించింది. క్లోజ్డ్ షాపు (closed shops) సాంతం ఎత్తివేసింది. ఎక్కడన్నా వున్నా అక్కడకూడా బహిరంగ షాపుల్లో (open shops) అమ్మే ధరలకే సరుకు అమ్మటానికి అనుమతించింది. వీటన్నిటి ఫలితంగా ప్రభుత్వం తలపెట్టిన వుద్దేశ్యం కొంత నెరవేరకపోలేదుగాని అనుకున్నంతగా మాత్రంమార్పులు జరగలేదు. వేతనాల్లోవ్యత్యాసం వున్నందువల్ల కొందరుమాత్రం బాగాలాభించారు. రష్యాలో స్టైఖనోవ్ (Stakhanov)

అనే అతడు తక్కువ కాలంలో ఎక్కువ వుత్పత్తి చేసే మార్గం ఒకటి కనిపెట్టాడు. అందువల్ల ఆ స్టెఖనోవ్ అనుయాయులు మాత్రం దీనివల్ల (differentiation of wages) బాగా లాభించారు.

ఏమైనప్పటికీ యీపద్ధతు లన్నింటివల్ల పారిశ్రామిక కూలీ వర్గాన్ని సృష్టిస్తానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నం కొంత ఫలించింది.

# X

పంచవర్ష ప్రణాళికలద్వారా సోవియట్ ప్రభుత్వం ప్రజల జీవిత పరిమాణాన్ని అధికంగా పెంచడానికి, పారిశ్రామికాభి వృద్ధికి అవసరమైన బ్రహ్మాండమైన భారీయంత్రాల్ని నిర్మించ డానికి, ప్రజల్లో వైజ్ఞానిక వికాసాన్ని పెంపొందిస్తానికి, మానవ మనోప్రవృత్తుల్నే మార్చివెయ్యడానికి పూనుకుంది. 1928 లో ప్రవేశపెట్టిన ప్రధమపంచవర్ష ప్రణాళిక నిజానికి నాలుగుసంవత్స రాల్లోనే పూర్తి అయింది. దేశంలోయంత్రోత్పత్తి బ్రహ్మాండంగా జరిగింది. వ్యవసాయశాఖకు కావలసిన ట్రాక్టర్లు (Tracors) మొదలైన యంత్రాలు చాలా ఎక్కువగా వుత్పత్తి జరిగాయి. సమిష్టి వ్యవసాయం అమల్లోకి వచ్చింది. కాని ప్రజలుమాత్రం చాలా కష్టాలకు త్యాగానికి, గురికావలసి వచ్చింది. కొన్ని శతాబ్దాల పరిణామాన్ని కొన్ని సంవత్సరాల్లో తీసుకు రావా లంటే ఎంత దుస్సాధ్యమైనపనో, ఎంత త్యాగంకావాలో, ఎంత శీఘ్రగమనం చెయ్యాలో వేరే చెప్పనక్కర్లేదు.

కొనుగోలు వస్తువుల వుత్పత్తి అంచనా ప్రకారం తగ్గించి, యంత్రోత్పత్తి చెయ్యడమంటే ప్రజల్ని కేవలం అవస్థలపాలు చెయ్యడమే. కొద్దో గొప్పో వుత్పత్తి అయిన ఆహారపదార్థాలు మాత్రం ముందుగా ప్రభుత్వం తనకు కావలసినంత వరకు డబ్బిచ్చి వశపరుచు కొనేది. యుద్ధానికి అవసరమైన సైనికులు పారిశ్రామికాభివృద్ధికి జీవగఱ్ఱ అయిన కార్మికులకు మాత్రం అవి సరఫరా చేసేది. దేశం యావత్తు కొనుగోలు పదార్థాల కొరతతో, భోగరాహిత్యంగా, ఆహారపదార్థాల కొరతతో కాలం గడపవలసి వచ్చేది.

కనకనే 1933 లో ప్రవేశపెట్ట దలుచుకొన్న ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కొనుగోలు వస్తువుల వుత్పత్తికి ఎక్కువ ప్రాధాన్యత యివ్వడానికి నిశ్చయించు కున్నారు. యుద్ధపరికరాలు, మందుసామానులు వుత్పత్తి చెయ్యడంగూడా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమంలో రెండవ భాగం. ముఖ్యంగా కొనుగోలు వస్తువుల వుత్పత్తి అధికంగాచేసి ప్రజల జీవిత పరిమాణాన్ని చాలారెట్లు పెంచాలని ప్రభుత్వాశయం. అందు కనే ప్రథమ పంచవర్ష ప్రణాళిక పూర్తి కాక మునుపే అటు ఒకప్రక్కన కొనుగోలు పదార్థాల వుత్పత్తిని తగ్గించాల్సి తగ్గిస్తూనే యిటు దేశంలో మాత్రం బోల్షివిక్ పార్టీ సభ్యులు నాయకులుగూడా ప్రజల భోగాలు,అవసరాలు ఎక్కువ కావాలని వారి జీవిత పరిమాణం, కొనుగోలుశక్తి ఎన్నోరెట్లు అభివృద్ధి చెందాలని ప్రచారం మొదలుపెట్టారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ద్వారా యీ అవసరాలన్నీ తీర్చడానికి సంకల్పించుకొనే, అప్పుడు అట్లాంటి ప్రచారం చేయించారు. కాని ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కూడా యిందుకు పూనుకోలేకపోయింది. 1931 లో జపాను మంచూరియా మీాద పడ్డది. 1933 లో ఫాసిస్టుపార్టీఅయిన హిట్లరు నాజీ పార్టీ జర్మనీలో అధికారంలోకి వచ్చింది. ఎటుచూచినా యుద్ధ భయం పొడకట్టుతూంది. రష్యాచుట్టూ యుద్ధమేఘాలు ఆవరించాయి. ఏనిమిషానబట్టినా చుట్టూవున్న కేపిటలిస్టు దేశాలు తనపై యుద్ధానికి దిగుతాయన్న భయం నానాటికి ఎక్కువఅవుతూంది.

ఈ పరిస్థితుల్లో వచ్చిన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కొనుగోలు వస్తువులవుత్పత్తి అధికంచేసే తన కార్యక్రమాన్ని అవతలకు నెట్టింది. యుద్ధపరికరాలు, మందుసామగ్రి, మారణ యంత్రాలు— వీటినే అధికంగా వుత్పత్తిచేస్తానికే పూనుకుంది. సోవియట్ ప్రభుత్వంయొక్క అనుమానాలు, భయాలు జూను 22,1941 నాటికి పొరపాట్లు కావనీ, నిజాలేననీ తేలిపోయినయి. యుద్ధభయమే లేకపోతే రష్యా యీనాటికి ప్రజాశ్రేయస్సుకై తలపెట్టిన కార్యక్రమంలో అనూహ్యమైనంత ముందుకు పోయేది. కాని ప్రపంచపరిస్థితుల్ని విస్మరించి ప్రయోజనం లేదు. చుట్టూ యుద్ధాలే నిత్యకృత్యంగా పెట్టుకొనే కేపిటలిస్టు దేశాలు, ఫాసిస్టుదేశాలు వున్నప్పుడు రష్యా అదిమరచిపోయి తన ప్రజల అభివృద్ధికై పాటుపడుతున్నానుగదా అన్న లెఖ్ఖలో

వుంటే చుట్టూ వున్న దేశాలకు ఆహుతి కాకతప్పదు. బోల్షివిక్ నాయకులు మొదటినించీగూడా వూహావాదులు కాకుండా, పరిస్థితుల్ని అర్థంచేసుకొని, రష్యాలో సోషలిస్టువ్యవస్థాపన చెయ్యాలనే ముందుచూపుతో పరిస్థితులకు అనుగుణ్యంగా నడుస్తూవచ్చారు.

1939 లో ప్రవేశపెట్టిన తృతీయ పంచవర్ష ప్రణాళిక కేవలం ప్రజల జీవిత పరిమాణం పెంచడానికి వైజ్ఞానికాభివృద్ధికి పాటుపడడానికి తలపెట్టిందే. కాని జర్మన్ ఫాసిస్టులు 1941 లో రష్యాపై పడటంవల్ల దాన్నిగూడా వెనక్కునెట్టవలసి వచ్చింది. ఏవిధంగా చూచినా యుద్ధమో, యుద్ధ భయమో—యివే రష్యా గమనాన్ని చాలావరకు అరికట్టినయి. వీటిని దృష్టిలో పెట్టుకొని తన నిర్ణీతగమనాన్ని సాగించకుండా యుద్ధాన్ని ఎదుర్కొనే బలాన్ని చేకూర్చుకోవడంతోనే యీ 25 సంవత్సరాలు గడిపింది.

ఎన్ని అవాంతరాలు వాటిల్లినా యీనాటి రష్యాస్థితిగానీ, కార్మికుని స్థితిగానీ పారిశ్రామికాభివృద్ధి గానీ రష్యన్ప్రజల వైజ్ఞానికాభివృద్ధిగానీ, రష్యన్ స్త్రీల పరిస్థితులుగానీ, ప్రజల జీవిత పరిమాణంగానీ—ఏది చూచినప్పటికీ ప్రపంచం దిగ్భ్రమ చెందుతూంది. వ్యావసాయిక దేశమైన రష్యాలాంటి దేశంలో యింత స్వల్పకాలంలో యిన్ని బ్రహ్మాండమైన మార్పులువచ్చి నూటికి నూరుపాళ్లు సోషలిజంలో యింకా ఎట్లా వుంటుందో అని ప్రజల్ని ఆశపెట్టే పరిస్థితులు కల్పించ బడ్డాయంటే,

ప్రభుత్వాధికారంలో మార్క్సిస్టు — సోషలిస్టు నాయకులు వుండడమే కారణం.

ఈనాడు రష్యాలో మనిషిని మనిషి దోచుకొనే హక్కు లేదని చెప్పినా, ప్రతివారికి సమానావకాశాలు కల్పించబడు తున్నాయని చెప్పినా, వైజ్ఞానికాభివృద్ధి అనూహ్యమైనంతగా జరిగిందని చెప్పినా, వుత్పత్తి సాధనాలు కొందరు వ్యక్తులసొంత ఆస్తిగా వుండకుండా సంఘపర మయ్యాయి అన్నా, ఎవరూ ఆశ్చర్య పడక్కర్లేదు.

అక్టోబరు విప్లవం సోషలిస్టు విప్లవమని భ్రమించే వారికి విప్లవానంతరపు యీరష్యన్ చరిత్రే సమాధానం కాగలదని నా నమ్మకం.

# XI

రష్యన్ విప్లవచరిత్ర యింత చర్చించినమీదట సోవియట్ రాజ్యాంగ నీతినిగురించి ఏమీ చెప్పకుండాముగిస్తే యీ చరిత్ర సమగ్రమైంది అవదని నా అభిప్రాయం. దీన్ని కొంతవరకు సందర్భోచితంగా యిదివరకేవివరించాను. అయినప్పటికి యింకా కొంచెం విపులంగా వివరించవలసిన అవసరం వుంది.

బోల్షివిక్ పార్టీ రష్యాలో అధికారంలోనికి వచ్చినతరువాత నెమ్మది నెమ్మదిగా ప్రపంచ విప్లవంమాట మరచిపోయిందనే వారు కొందరున్నారు. రష్యన్ సోవియట్ ప్రభుత్వం తన ఆదర్శ మైన కమ్యూనిజానికే తిలోదకాలిచ్చిందని, క్రమ క్రమంగా

కేపిటలిజాన్ని వృద్ధిచేసుకుంటూందని, అక్కడ దోపిడీదారులు దోపిడికి గురిఅయ్యేవాళ్ళూ తయారవుతున్నారని అనేవాళ్ళూ వున్నారు. అంతర్జాతీయ వాదానికి తిలోదకాలిచ్చి, జాతీయ భావాలు, జాతీయవాదం వృద్ధిచేసుకొంటూందని, అక్కడ గూడా సామ్రాజ్యవాదం (Red Imperialism) తయారయిందనీ చెప్పేవారుగూడా వున్నారు. వీటన్నిటికి సరియైన సమాధానాలు చెప్పాలంటే విప్లవానంతరం సోవియట్ రష్యా అవలంబించిన రాజనీతి ఏమిటో అట్లా ఎందుకు ప్రవర్తించాల్సి వచ్చిందో, అన్న విషయాలు చర్చించవలసి వుంటుంది. రష్యా రాజనీతికి వెనకవున్న యీ విషయాలన్నీ సమగ్రంగా తెలుసుకోగలిగినప్పుడే, దాన్ని సక్రమ పద్ధతిలో అర్థం చేసుకోగలం.

రష్యాలో విప్లవం జరిగిన నాటికి ఐరోపా ఖండంలో— ముఖ్యంగా జర్మనీ, ఫ్రాంసు దేశాల్లో—పరిస్థితులు సోషలిస్టు విప్లవానికి చాలా అనుకూలంగా వున్నయి. గత యుద్ధానంతరం జర్మనీలో విప్లవం తప్పక వస్తుందని, నెగ్గుతుందనిగూడా లెనిన్ మొదలైన సోషలిస్టు నాయకులు వూహించి, ఆశించారు. కాని దురదృష్టవశాత్తు జర్మనీలో విప్లవం రానూవచ్చింది, వోడిపోనూ పోయింది. జర్మనీలో విప్లవం ఏవిధంగా వోడిపోయిందో అన్న విషయం మనం యిదివరకే చర్చించా మనుకుంటాను.

మిగతా పశ్చిమ ఐరోపాఖండ దేశాల్లోగూడా విప్లవాలు వోడిపోయినవి. అందుకు గల కారణాలనుగూడా మనం యిది

వరకే పరిశీలించాం. ఆ దేశాల్లో విప్లవాలు ఓడిపోవడంవల్ల ఐరోపాఖండమంతటా తిరిగి విప్లవప్రత్యా ఘాతకతత్వం బాగా తలెత్తింది. ప్రత్యాఘాతక ఐరోపాఖండమంతా సోవియట్ రష్యావైపు ఆకలి చూపులు చూడడం మొదలు పెట్టింది. విప్లవాలు వీగిపోయిన దేశాల్లో తిరిగి విప్లవాలు రావడానికి కూడా వీలులేనంతగా అక్కడున్న విప్లవశక్తుల్ని చిదిమివెయ్యడం జరిగింది. ప్రపంచ విప్లవాన్ని నడపడానికి అర్హత ఒక్క జర్మనీకే వుందని జర్మనీనాయకత్వం కొరకు ఎదురుచూస్తున్న లెనిన్ మొదలైన బోల్షివిక్ నాయకులకు తీరని ఆశాభంగం కలిగింది. అప్పుడు ఆ నాయకత్వం వహించడం సోవియట్ రష్యాకు తప్పనిసరి అయింది.

దీన్ని సక్రమంగా నెరవేర్చి ప్రపంచ విప్లవానికి సోవియట్ రష్యా దోహదమివ్వాలంటే ముందు దాని అస్థిత్వానికి భంగం కలగకూడదు. సోవియట్ ప్రభుత్వం పతనం కాకుండా నిలబడ గలిగితేనే ప్రపంచ విప్లవ శక్తులకు ఒక విప్లవప్రభుత్వం, ఒక బ్రహ్మాండమైన విప్లవ సైన్యం అండగా వుండగలవు. కనక ప్రపంచ విప్లవశక్తుల భవిష్యత్తు అంతా సోవియట్ ప్రభుత్వం దాని విప్లవ సైన్యం వీటిరెంటి అస్థిత్వంమీద ఆధారపడి వుందన్నమాట. కొంత కాలంవరకు చుట్టూవున్న దేశాలు తన మీద పడకుండా తన్ను తాను రక్షించుకో గలిగితే ప్రపంచ విప్లవశక్తులకు తోడ్పడినట్లేనన్న సత్యాన్ని సోవియట్ ప్రభుత్వం గ్రహించింది. కనక అప్పటినించీ దాని విదేశాంగ

నీతి, అంతర్జాతీయదృక్పథం, ప్రపంచ విప్లవ కథా, అన్నీ తన రక్షణా విధానం (defence policy) లోనే ఆధారపడివున్నాయని తెలుసుకొని తన రక్షణే ప్రధాన కార్యక్రమంగా పెట్టుకుంది.

ఈ దృష్టితోనే సాధ్యమైనంతవరకు చుట్టూవున్న దేశాలతో వ్యాపార ఒడంబడికలు చేసుకోవడానికి ప్రయత్నించింది. కొన్ని దేశాలతో రాజకీయ ఒడంబడికలు సైతం చేసుకోవడానికి కృషిచేసింది. యుద్ధంలో గెలిచిన దేశాలకు—ముఖ్యంగా యింగ్లండుకు—రష్యాయంటే బాగా కన్నుగుట్టడం సాగింది. రష్యాను నానాజాతిసమితి (League of Nations) లో చేర నివ్వకుండా చేసింది. ఇతర దేశాలు ఏవీకూడా రష్యాకు అప్పు బెట్టకుండా చేసింది. రష్యాతనతో పరికమైనసంధి చేసుకుందా మని ప్రయత్నించినా పడకుండా చేసింది.

ఈ పరిస్థితుల్లో రష్యాతో ఒడంబడిక కుదుర్చుకోవడానికి సిద్ధంగావున్న దేశం ఒక్క జర్మనీదేశం తప్పితే యింకేదీలేదు. వర్సైల్సు సంధిద్వారా జర్మనీని ఆర్థికంగా, సైనికంగా, రాజకీయంగా ఎన్నివిధాల కుంగదీస్తానికి అవకాశంవుంటే అన్ని విధాల కుంగదీస్తానికి పూనుకుంది యింగ్లండు. వర్సైల్సు సంధి జర్మనీకి చాలా అవమానకరమైన సంధిగా జర్మనులు గుర్తించారు. వారిలోవున్న జాత్యహంకారం దానిద్వారా బాగా ప్రకోపింప బడింది. ఏవిధంగా తిరిగి యితర దేశాలతో పాటు తలెత్తుకొని నిలబడి వర్సైల్సుసంధి కారకులపై పగ

సాధించడమూ అన్న జాతీయతత్వం జర్మనీవాదిలో జీర్ణించింది. కాని ఇప్పుడు జర్మనీకి సాయపడే దేశం కేపిటలిస్టు దేశాల్లో ఒక్కటిగూడా లేదు. కాగా పోగా యిక మిగిలింది ఒక్క రష్యా. రష్యాగూడా జర్మనీతో ఒడంబడిక చేసుకోవడానికి తాపత్రయ పడుంది. దాని ఫలితంగానే జర్మనీ-రష్యాలమధ్య 1921-22 లో రాపెల్లో సంధి జరిగింది. దాని ఫలితంగా రష్యా నించీ ·జర్మనీ ముడిసరుకులు బాగా తెప్పించుకోవడం సాగించింది. జర్మనీ నించీ రష్యా తనకు కావలసిన యంత్రసామగ్రిని తెప్పించుకుంది. పైగా యంత్రాలను నడపగల ప్రజ్ఞాశీలురు కొందర్ని జర్మనీనించీ రష్యా రప్పించుకొని వారిసహాయంతో యంత్రాభివృద్ధి చేసుకోవడం రష్యక యువకులకు వారిచేత ఆయంత్ర పరిజ్ఞానాన్ని అంతా నేర్పించడం జరిగింది.

కాని రాపెల్లో ఒడంబడికవల్ల జర్మనీకిగూడా బాగాలాభం కలిగింది. తనకు రష్యాసరుకులు పంపించడంవల్ల తిరిగి తన పరిశ్రమల్ని నిలబెట్టుకోవడం, ఆర్థిక వ్యవస్థను కొంతవరకు చక్కజేసుకోవడం జరిగింది.

ఇదంతా చూసి యింగ్లండుకు కన్నుకుట్టింది. నెమ్మదిగా రష్యాజర్మనీలమధ్య ఒకవిధమైన రాజకీయ ఒడంబడికగూడా ఏదురుతుందేమోనని వుడికిపోయింది. జర్మనీ రష్యాలమధ్య సహకారం చెడగొట్టే తలంపుతో యింగ్లండు చల్లగా జర్మనీని దువ్వటం సాగించింది. ఇటలీ ఫ్రాంసుల్నిగూడా ఒప్పించి జర్మనీతో లొకార్నో సంధి (1924) చేసుకుంది. దీనిఫలితంగా జర్మ

నీపై ఆంతుగా నియమించబడిన కంట్రోలుకమీషన్ రద్దుచెయ్యబడింది. ఇంతే అంతకుముందు జర్మనీ తనసైన్యాన్ని ఎక్కువ పెంచుకోవాలన్నా యీ కంట్రోలు కమీషన్ ఆజ్ఞ పొందిగాని పెంచుకోవడానికి వీలులేదు. ఈ కమీషన్‌లో ఇంగ్లండు, ఫ్రాంసు, ఇటలీ దేశాల ప్రాధాన్యత చాలాఎక్కువగా వుండేది.

ఇకరష్యా మళ్ళీ ఏకాకిఅయింది. ఏదోఒక దేశాన్ని అండ చేసుకోకపోతే ఏ నిమిషాన అన్ని దేశాలు కలిసి తనమీద యుద్ధాన్ని ప్రకటిస్తాయో అన్నభయం రష్యాకు నానాటికి ఎక్కువ అవుతుంది. నెమ్మదిగా ఇంగ్లండుతో వ్యాపారబడం బడిక చేసుకుంది. జర్మనీకి కన్నుగుట్టింది. అదేసమయంలో రష్యా ఫ్రాంసుతో సంధిచేసుకుంది. ఈవిధంగా ఏ ఒక్క దేశాన్ని నమ్ముకొని దానిమీద ఆధారపడి కూచోకుండా, చుట్టూవున్న కేపటలిస్టు దేశాలుమాత్రం అన్నీ ఏకంకాకుండా వుండేటట్లుచూస్తూ రష్యాతన విదేశాంగనీతిని నడుపుకుంటూ వచ్చింది.

జర్మనీలో 1933లో హిట్లరు నాయకత్వంకింద ఫేసిజం అధికారంలోకి వచ్చింది. ఆనాటినించీ రష్యాతన విదేశాంగనీతిని యింకాజాగ్రత్తగా, బహునేర్పరితనంతో నడుపుకోవలసి వచ్చింది. జర్మనీలో అంతకుముందున్న రిపబ్లికన్ ప్రభుత్వం కొంతగాకపోయినా కొంతైనప్పటికి రష్యాతో స్నేహభావంతో వుండేది. హిట్లరు నాయకత్వంక్రింద జర్మనీలో అధికారంలోనుక వచ్చిన ఫేసిస్టుప్రభుత్వం రష్యాకు కేవలం విరోధభావంలో ప్రవ

ద్రించసాగింది. అంతేగాకుండా సోవియట్ రష్యాను ప్రతిగా నెలకొల్పబడిన కూటమికి నాయకత్వం వహించడానికిగూడా ప్రయత్నిస్తుంది. ఈకొత్త పరిస్థితుల్లో రష్యాతన ఆదర్శమైన కమ్యూనిజానికీ, అంతర్జాతీయవాదానికీ అపకారం జరక్కుండావుండేట్లు చూడాలంటే ఆపరిస్థితుల్ని అర్థంచేసుకొని వాటిని ఎదుర్కొంటానికి తగినకార్యక్రమాన్ని తయారుచేసుకోవాలి. సోవియట్ ప్రభుత్వం సరిగ్గా అదేపని చేసింది. దాన్ని అర్థం చేసుకోలేనివాళ్ళు రష్యాగూడా అంతర్జాతీయ వాదాన్ని, కార్మిక కార్యక్రమాన్ని విస్మరించి జాతీయ వాదానికి అమ్ముడుపోయిందిఅని అంటం సాగించారు.

కార్ల్‌మార్క్సు ఫేసిజాన్ని ఊహించలేదు. ఫేసిజం ప్రజాస్వామికానికే విరుద్ధం. సంఘంలో సోషలిజానికి ఎదురుతిరిగే కొన్నివర్గాలు సైతంప్రజాస్వామికాన్ని మాత్రం అంగీకరిస్తాయి. అంటే సాంఘికంగా సోషలిజం కంటె ప్రజాస్వామికం విశాలమైంది అన్నమాట. అట్లాంటి ప్రజాస్వామికానికే ఫేసిజం ఎప్పుడైతే ఎదురైందో ఫేసిజానికి ఒక్క కార్మికశక్తులే గాకుండా మరికొన్ని వర్గాలుగూడా వ్యతిరేకంగా వుంటాయి. ప్రపంచ మంతటా విప్లవం జరిగి సోషలిస్టు వ్యవస్థాపన జరగాలంటే ఫేసిజం ఎక్కడా వుండకూడదు. కనక ఫేసిజానికి వ్యతిరేకమైన అన్నిశక్తుల్ని కూడగట్టుకు రావడానికి కృషి చెయ్యడమే అక్కడినించీ తనకార్యక్రమంగా పెట్టుకుంది రష్యా. దీని ఫలితమే స్పెయిన్, ఫ్రాంసు మొదలైన దేశాల్లో బయలుదేరిన పీపుల్సు ఫ్రంట్ వుద్యమం.

దీనివల్ల రెండుపనులు నెరవేరతయి. ఒకటి తనచుట్టూ వున్న దేశాలన్నీ ఒకటి అయి తనమీద పడకుండా వుండడం. రెండు సోషలిస్టు వ్యవస్థాపనకు కేవలం వ్యతిరేక సిద్ధాంతమైన (anti thesis) ఫేసిజం బలపడకుండా వుండడం. ఈదృష్టిని అర్థం చేసుకోలేనివారే సోవియట్ రష్యా కార్మిక నియంతృత్వానికి స్వస్తి చెప్పిందని సంకుచిత జాతీయవాదానికి కట్టుబడ్డదని అపోహ పడ్డారు.

ఇక యింకోవాదనగూడా ఖండించవలసిన బాధ్యతవుంది. సోవియట్ రష్యాగూడా సామ్రాజ్యవాదానికే కట్టుబడ్డదన్న వాదన. ఈవాదన చేసేవారు తమ్ము బలపరుచుకోవడానికై పోలెండు, ఫిన్లెండుల పై రష్యాచేసిన దండయాత్రను వుదాహరణగా చెబుతుంటారు. వీటినిగురించి ఎక్కువగా చర్చించక్కర్లేకుండానే రష్యా, పోలెండు ఫిన్లెండులమీద దండెత్తడం కేవలం ఆత్మరక్షణకేగాని సామ్రాజ్యతృష్ణతోగాదని యిప్పటికే చరిత్ర రుజూచేసింది. అసలు పోలెండు ఫిన్లెండుల భూతచరిత్రను పరిశీలిస్తే వాటిస్వాతంత్ర్యాన్ని ఎవరు ప్రసాదించారో, ఎవరుగౌరవించారో, ఎవరుకాపాడారో అర్థమవుతుంది. జాతుల స్వయం నిర్ణయాధికారాన్ని ప్రప్రథంగా అంగీకరించి పోలెండు, ఫిన్లెండుల స్వాతంత్ర్యాన్ని గుర్తించడంద్వారా సోవియట్ప్రభుత్వం రష్యావిప్లవాన్ని సార్థకం చేసింది. కాని దానికి ప్రతిఫలంగా మాత్రం ఆరెండు దేశాలు యింగ్లండు ఫ్రాంసు దేశాల్లాంటి దేశాల మాటలు నమ్మి సోవియట్ రష్యాకుఎప్పుడూ విరోధం

గానే పనిచేసినయి. ఈ చిన్న దేశాలచేత గిల్లి కయ్యం పెట్టించి రష్యామీాద యుద్ధంచెయ్యాలని పెద్దపెద్ద కేపిటలిస్టు దేశాలు చాలా తంటాలుపడ్డయి. ఈ రెండు దేశాలు, రష్యాలమధ్య గల పొలిమేరల్లో ఎన్నో సంఘర్షణలు జరిగాయి. ఎన్ని జరిగినా రష్యా జాగ్రత్తగా తప్పించుకొంటూ యుద్ధం తెచ్చుకోకుండా కాపాడుకొంటూ వచ్చింది.

ఈ యుద్ధారంభంలో జర్మనీ *పోలెండుమీాదబడి ఆక్రమించుకొంటూ వస్తున్నప్పుడు, పోలెండులో దాన్ని అరికట్టే ప్రభుత్వం అనేది ఒకటి లేనప్పుడు, రష్యా తనకు వాటిల్లనున్న ప్రమాదాన్ని గుర్తించింది. చూస్తూ వూరుకుంటే జర్మనీ పోలెండు అంతా ఆక్రమించుకొని తనకు పక్కలోని బల్లెం కాగలదు. అందువల్ల సోవియట్ ప్రభుత్వమే తన సేనల్ని పంపి పోలెండును కొంత ఆక్రమించుకోక తప్పలేదు. ఇది కేవలం ఆత్మరక్షణకేనన్న సత్యం తరువాతగాని బైటపడలేదు.

ఫిన్లెండు విషయంలోకూడా యిదే జరిగింది. పెద్ద దేశాల మద్దతు చూసుకొని ఫిన్లెండు రష్యాపై విరోధభావం ప్రకటించడం సాగించింది. తన రక్షణశ్రేణులు నిర్మించుకోవడానికై రష్యా తనభూభాగాన్ని అధికంగా ఫిన్లెండుకు యిచ్చి ఫిన్లెండులో కొన్ని మిలిటరీ ప్రాధాన్యతగల స్థావరాలను మాత్రమే తనకు

* యుద్ధానికి ముందు పోలెండుకు తన సేనల్ని పంపి కాపాడతానని రష్యా యిచ్చిన నమ్మకాన్ని పోలెండు యింగ్లండు మద్దతుతో త్రోసివేసిన గాథ అందరికి తెలిసినవిషయమే.

యివ్వమంటే *ఫిన్లెండు ససేమిరా అంది. పోనీ తనపైపడే శత్రువుల్ని అరికట్టే టంతటి బలపత్తరంగా నైనా వుందా అంటే అదీలేదు. దీన్నిబట్టి ఫిన్లెండు తన వుద్దేశ్యప్రకారం కాకుండా రష్యాపై యుద్ధం తీసుకు రావాలని వాంఛించే మద్దత్తుదారుల ప్రోద్బలం చేతనే యీ మూర్ఖత్వానికి దిగిందని అర్థంచేసుకొని, రష్యా కేవలం ఆత్మరక్షణకై ఫిన్లెండులో కొన్ని స్థావరాల్ని ఆక్రమించుకోక తప్పింది కాదు.

రష్యా అంటే గిట్టనివారు దీన్ని ఒక అవకాశంగా తీసుకొని సోవియట్ ప్రభుత్వానికి సామ్రాజ్యతృష్ణ ఎంతగా వుందని దుష్ప్రచారం చేసినా నెమ్మదిమీద చరిత్రే రుజూచేసింది రష్యా ఋజుత్వాన్ని.

ఇదంతాకూడా సోవియట్ రష్యా రెండు విషయాలు దృష్టిలో వుంచుకొని చేసిందని యిదివరకే అనుకున్నాం. ఒకటి అంతర్జాతీయంగా సోషలిస్టు విప్లవానికి దారితియ్యడం. రెండు ఆత్మరక్షణ. రెండవది చాలా ముఖ్యం. ఎందుకని అంటే యీ రెండవదాని మీదనే మొదటిది ఆధారపడి వుంది. ఈదృష్టిలో గత 25 సంవత్సరాల అంతర్జాతీయ రాజకీయాలను పరిశీలిస్తే రష్యా బహునేర్పరితనంతో, లోకోత్తరమైన రాజనీతితో, ప్రతిభావంతంగా, ప్రవర్తించిందని తేలికగా అర్థం అవుతుంది.

---

* ఫిన్లెండు అంతకుముందు రష్యాతో అట్లాంటిక్ ఒడంబడిక చేసుకుంది. తీరా సమయానికి యిగ్లండు, అమెరికాల ఆసరాచూసుకొని కాదన్నది.

# XII

ఈ యుద్ధంలో నానాటికి జరుగుతున్న మార్పుల్ని గమని స్తుంటే సోవియట్ రష్యా తను యిదివరకు పాటించిన విదేశాంగ నీతి అనుకోనంత సుముఖంగా ఫలించే అవకాశాలు కనిపిస్తున్నాయి. ఈ యుద్ధ ఫలితంగా యింగ్లండులో బ్రహ్మాండమైన మార్పులు కలిగినయి. రష్యా అన్నా, సోవియట్ విధాన మన్నా శీతకన్ను వేసే ప్రత్యాఘాతక శక్తుల పలుకుబడి ఇంగ్లండులో నానాటికి క్షీణించి పోతూంది. సోషలిస్టు సూత్రాలన్నా, సోవియట్ రష్యా అన్నా, ఎక్కువమందిలో సుముఖత్వం ఏర్పడుతూంది. ఇంగ్లండు రష్యాలమధ్య యిదివరలోవున్న అవిభేద్య ప్రతిబంధకాలు భేద్యమైనయి. ఈ రెండు దేశాల మిత్రత్వాన్ని సుస్థిరంచేస్తానికే 20 సంవత్సరాల రాజకీయ ఒడంబడిక జరిగింది. ఈనాడు మిత్రమండలిలో అమెరికా యింగ్లండుల మధ్యకంటే యింగ్లండురష్యాలమధ్య మంచిసంబంధాలు కుదిరే సూచనలు కనబడుతున్నయ్యంటే ఆంగ్ల రాజకీయ వేత్తల మనోప్రవృత్తుల్లో వచ్చిన విప్లవం సామాన్య మైందికాదు.

ఏది ఎట్లా అయినప్పటికీ రష్యాకు మంచి భవిష్యత్తు కనిపిస్తూంది. అక్టోబరు విప్లవానంతరం లెనిన్ నూతన ఆర్థిక విధానంతో ప్రారంభమైన సోవియట్ ప్రభుత్వకార్యక్రమం— ఒకటి రష్యాలో సోషలిస్టు వ్యవస్థానకు దారితియ్యడం, రెండు ప్రపంచవిప్లవానికి అవకాశాలు కల్పించడం — యిదివరకే కొంత భాగం ఫలించి నప్పటికీ పూర్తిగా ఫలించే శుభసమయం చాలా దగ్గర్లోనే వున్నట్టుగా ఆశాజ్యోతులు కనిపిస్తున్నయి.

---